


పంపిణీదారులు: ఆంధ్ర - జనచైతన్య ఫిలింస్, విజయవాడ, ఫోన్ నెం: 73320 -

JAGATI Rs. 2-00 November 1989

35th Year of Publication




## నవంబరు - 1989

## సాహితీ సుధ

తుంగ తరంగ భంగములతో దులదూగు విలోల భోగముల్
భంగపడున్ నిమేషమున బ్రాణము కొన్ని దినంబులే సుఖం
బంగనలందు నిట్లు మది నారసి బ్రహ్మ విచార యత్న ము
పొంగుచు జేయగా వలయు భూరి జగద్ధిత బుద్ధి పండితుల్.

—భర్తృహరి

మగువ నిన్నే కాని మనసులో వేఁడొక్క - తెలవ దలంచ భూదేవి యా
అతివ నిన్నే కాని యాసతో వేఁడొక్క - వనిత గోరను నభోవాణి యాన
సుదతి నిన్నే కాని చూడను వేఁడొక్క - పడతిని భారతీ భర్త యాన
పొలతి నిన్నే కాని పూనిక వేఁడొక్క - కలికి నెంచను రమాకాంత యాన
అబల శివునాన నే గోర నన్యసతుల- నొప్పికొను మింక నితర మే నొక్క టెఱుంగ
భావమందైన దప్ప నీ పదములాన - తాళనిచ్చునె ప్రేమ కాంతాలలామ

—కాంతాలలామ శతకం



'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004 ఫోన్ : 76697- చందా 2 సం॥లకు రు. 45-00 – 5 సం॥లకు రు 100-00. జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: ఇందిరా గాంధీ

# నిమ్మతోనలు

రిచర్డ్ నిక్సన్ 1965 లో ఛౌయన్ లైని ఒకసారి 'బెజింగ్‌లోని మీ చైనా ప్రభుత్వాన్ని అమెరికా గుర్తించిందనుకోండి'-అన్నాడు. అప్పటికి ఫార్మోజాన్ని మాత్రమే అమెరికనులు దౌత్యపరంగా గుర్తించారు. మెయిన్ లాండ్ చైనాని గుర్తించలేదు.

ఛౌయన్‌లై తన సహజ విరుహాసంతో చెప్పాడు. "మీరు మమ్మల్ని గుర్తించడమా మేము మిమ్మల్ని గుర్తించాలిగాని !'

ఒక జర్నలిస్టు ఛౌయన్‌లైని అడిగాడు: మీరు కమ్యూనిస్టులాలేరు - చైనీయ పండితునిలా మాట్లాడుతున్నారు."

"నేను మొదటి చైనీయుణ్ణి - చైనీయ సంస్కృతీ వారసుణ్ణి. ఆ తర్వాతనే సామూహిక క్షేమం కోసం కమ్యూనిస్టుని."

ఛిజియాంగ్ పట్నం జపనీయుల ఆక్రమణలో ఉంది. జపనీయులని తమ భూభాగం నుంచి తరిమి కొట్టేందుకు వేర్వేరు రంగాలలో యుద్ధం జరుగుతోంది.

"ఆ పట్నం మన వశమవాలని మీకెందుకంత పట్టుదలగా ఉంది ?" అని అడుగుతాడు ఒక సైనికాధికారి.

"మా అమ్మగారు ఛిజియాంగ్‌లో చనిపోయింది. ఆమె సమాధిచుట్టూ పెరిగిన చీడ మొక్కలు లాగేసి పుష్పగుచ్ఛం ఉంచాలని !" అంటాడు ఛౌయన్‌లై.

పెద్ద మనిషి అనగా ఎవరు ? — అని అడిగిన ప్రశ్నకు ఛౌయన్‌లై చెప్పిన సమాధానం: 'కన్‌ఫ్యూజియస్ సూత్ర ప్రకారం పెద్ద మనిషి అనగా సత్పురుషుడు. నిశ్చలతత్వం, నిగూఢ శక్తి, మేథాసంపద, దయాంతఃకరణ, మనోధృతి, సౌజన్య లక్షణంగల మంచి మనిషి.'

ఛౌయన్‌లై సోవియట్ యూనియన్‌కి వెళ్ళాడు. 'అప్పట్లో కృశ్చేవ్ స్టాలిన్‌నీ తూలనాడటమే పనిగా పెట్టుకున్నాడు. ప్రభుత్వ సమాచారయంత్రాంగం యావత్తూ స్టాలిన్ దుష్కృత్యాలు పేర్కొంటూ తిట్టి పోస్తోంది.

ఛౌయన్‌లై స్టాలిన్ సమాధి మీద పూలమాల ఉంచి వందనం చేశాడు. ఆ పుష్పహారానికి దిగువని 'ది గ్రేట్ మార్క్సిస్టు లెనినిస్టు' అనే అభినందన ఉంది.

తన చెంప ఛెళ్ళుమనేటట్టు వున్న ఆ ప్రశంసకు కృశ్చేవ్ కుపితుడై, పార్టీ సమావేశంలో, 'స్టాలిన్ సమాధి

అక్కడి నుంచి తొలిగించాలనే తీర్మానం ప్రవేశబెట్టాడు.

ఒక మృత వీరునిపై కృశ్చేవ్ కన బరుస్తున్న అసహనం భరించలేక పార్టీ సమావేశం నుంచి బయటకొచ్చేశాడు ఛౌయన్‌లై. ఆవిధంగా అరవైలలో చైనా రష్యాల మధ్య తెగతెంపులు ఏర్పడ్డాయి.

చైనా సేనలకు చెందిన ఒక ఉన్నతోద్యోగి అంటాడు: ఛియాంగ్ కెషేక్, ఛౌయన్‌లై, మావ్ సెటుంగ్‌లు చైనా చరిత్రలో త్రిమూర్తులు. ఛౌయన్‌లై ఎవరి వైపున వుంటే వారికి విజయం తథ్యం. ఆయన గాని ఛియాంగ్ కెషేక్ పక్షాన వున్నాడనుకోండి. అప్పుడు టైవాన్‌లో (ఫార్మోజా) తల దాచుకోవలసిన పరిస్థితి మావొకి ఏర్పడేది.

అమెరికన్ విప్లవం క్రమానుగతంగా ఒక పద్ధతిలో సాగింది. అక్కడి నాయకులకు తాము దేనికోసం పోరాడుతున్నదీ స్పష్టంగా తెలుసు. ఒకప్పుడు తమకుగల స్వాతంత్ర్యం పోయింది. దానిని తిరిగీ తాము సంపాదించుకోవడం వారి లక్ష్యం. అయితే, ఫ్రెంచి విప్లవం అలాటిది కాదు - దానిని నడిపినవారు మేధావంతులు, స్వప్నజీవనులూను. చరిత్ర దృష్ట్యా వారికి తమవైన పునాదులు లేవు. అందుకనే అది విఫలమైంది - అంటాడు ఛౌయన్‌లై.

పూల మొక్క తన చేతులతో నాటిన మనిషి పువ్వులు వికసించడాన్ని స్వయంగా చూడలేకపోవచ్చు; అవి వికసించి రాలిపోతాయి - అని చెప్పిన మావొ పలుకులకి అనుబంధంగా ఒక ప్రాచీన కవిత చెబుతాడు ఛౌయన్‌లై: 'శిఖరాగ్రాలు ఎంత ప్రమాదకరమో వాటి సౌందర్య కాంతులలో అంత వైవిధ్యం.'

—క్షీరసాగరమ్

# పాఠకుల తీర్పు

మిత్రులు శ్రీ చందూర్‌గారికి : నమస్కారములు. మద్రాసు నగరము తమిళులకెంత ముఖ్యమో ఆంధ్రులకూ అంత ముఖ్యమైనది. కేసరిగారి 'ముచ్చట్లు' అలనాటిగాధలను ఎంతో చక్కగా చెబుతున్నాయి. తెలుగు చిత్రకళను చిత్రకారులను తెలుగు వారికి పరిచయంచేసిన ముఖ్యమైన మాసపత్రిక కేసరిగారి 'గృహలక్ష్మి'

—పిలకా లక్ష్మీనరసింహమూర్తి
మద్రాసు-94

చందూర్‌గారికి : మీ పత్రిక చాలా బాగుంటున్నది. ముఖ్యంగా కేసరిగారి 'చిన్ననాటి ముచ్చట్లు' మాయింట్లో అందరినీ ఆకర్షిస్తున్నాయి.

—డి సుబ్రహ్మణ్యం
కొచ్చిన్

ఎడిటర్‌గారికి ; నమస్కారములు. అమెరికాలోని పదమూడు వలసలూ తమ స్వాతంత్ర్యం కోసం జరిపిన పోరాటమూ, ఆ విశేషాలూ ఎంతో రసవత్తరంగా ఉన్నాయి. 'మజిలి' కథలోని జానకిపాత్ర మాకెంతో నచ్చింది.

—సి నాగేశ్వరరావు
సికింద్రాబాదు-3

శ్రీ చందూర్‌గారికి నమస్కారములు. మీరు, శ్రీమతి మాలతిగారు చూపిన అభిమాన అప్యాయతలు స్మృతిపథంలో శాశ్వతంగా ఉండిపోతాయి. మిమ్ములను కలవడం కొత్త; మిమ్ములనుచూడటం కొత్త ; మీతో మాట్లాడటం కొత్త, అయినా ఎంతో చిరపరిచితులతో, ఆత్మీయులతో మాట్లాడినట్లు, వారిమధ్య వున్నట్లు అనుభూతి కలిగింది. మీ సహృదయతకు ధన్యవాదములు.

—యన్ శ్రీరామ్మూర్తి
నెల్లూరు-1

ఎడిటర్‌గారికి : నమస్కారములు. సెప్టెంబరు సంచిక 'చిత్రజగతి' సమీక్షలలో, ఉషాఆర్ట్ ప్రొడక్షన్స్ వారి 'ధ్రువకుమార్' అన్నారు. ఆ చిత్రం పేరు 'ధ్రువనక్షత్రం'. సమీక్షకులు ఈ పొరబాటు గమనించగలరు.

—యస్సార్ బాబు
హైదరాబాదు-16

మా తాతగారు ఎంత గొప్పవారో నాకు అక్కర్లేదు ; ఆయన మనమడు ఎలా నడుచుకుంటున్నాడనేది ముఖ్యం. —లింకన్

అతని మాటలు గాలిలో తేలుతాయి. కాని, భావాలు నేలబారుగా ఉంటాయి. భావపుష్టి లేని మాటలు పైకి ఎగరలేవు. —షేక్స్‌పియర్

# వెన్నెల కెరటాలు

## శతకాలు

తెలుగులో శతక ప్రక్రియ మొదట 12 వ శతాబ్దములో ఆవిర్భవించినది. ఈ ఎనిమిదివందల యేండ్లలో తెలుగు శతకము శాఖోపశాఖలుగా విస్తరిల్లి స్వరూపములోను, స్వభావములోను మిక్కిలి పరిణతి చెందినది. నాటికిని, నేటికిని శతకప్రక్రియ సజీవస్రవంతి వలె అవిచ్ఛిన్నముగా కొనసాగు చున్నది. మన సాహిత్యములో ముద్రితా ముద్రిత శతకముల సంఖ్య నాలుగైదు వేలకు మించియుండునని భావింప బడుచున్నది. శత సంఖ్యగల పద్యము లుండుటచే శతకము అనుపేరు సార్థక మగుచున్నది. కాని కవులు నూటెని మిది కాని నూట ఇఱువదిఏడు కాని పద్యసంఖ్య యుండునట్లు వ్రాయుట పరిపాటి. ఈలెక్క ప్రకారము తెలు గులోనున్న శతక పద్యముల సంఖ్య దాదాపు ఏబదివేల వరకుండును. ఇందు కొన్ని భక్తి శతకములు, మరికొన్ని శృంగార శతకములు కలవు. ఇంకను నీతి, వైరాగ్య, తత్త్వ, అధిక్షేప, హాస్యశతకములు కూడా కలవు.

—జి హనుమంతరావు
'స్రవంతి'లో

## మల్లంపల్లి

డిగ్రీలు లేకపోయినా తన ప్రతిభ వల్లా పాండిత్యంవల్లా, సౌహార్ధంవల్లా, పరిశ్రమవల్లా, పట్టుదల వల్లా ఆంధ్ర చరిత్ర సామ్రాజ్యానికి కిరీటంలేని చక్ర వర్తిగా నిలిచిన మహామనీషి శ్రీసోమ శేఖర శర్మగారు. ఆంధ్రత్వం చూడా లంటే మల్లంపల్లి వారిలోనే చూడాలి. ఎప్పుడూ చిరునవ్వుతో వికసించిన గంభీరమైన వదనం, సంప్రదాయం. మర్యాదచెడని ప్రవర్తన, వారిని చూడ గానే పొడచూపుతాయి. ఆయన అభ్యు దయవాది, అజాతశత్రువు, కార్యదీక్షా పరుడు. నిరాడంబరుడు. వారిని చారి త్రకులూ, సాహిత్యప్రియులూ, కవులూ, పండితులూ, పాశ్చాత్య వాసనా భరితులూ, ప్రాచ్యసంప్రదాయాభిని వేశం కలవారు కూడా సమానంగా ఆదరించేవారు. దానికి కారణం వారి

—ఆర్ ఏకాంబరాచార్యులు
'గాంధీక్షేత్రం'లో

---

మానవాత్మలోని అంతర్లీన సామ రస్యమే ముఖవర్చస్సుగా మనకి కని పిస్తుంది. —హాజ్‌లిట్

---

# పాతికేళ్ల నాటి పిక్చర్

## రాజ్యలక్ష్మీవారి 'వీరాభిమన్యు'

ద్రోణుని మూడవనాటి యుద్ధంలో ధర్మరాజు అభిమన్యునితో, అర్జునుడు నీవూ అచ్యుతుడూ ప్రద్యుమ్నుడూ తప్ప మరెవరూ ఈ వ్యూహాన్ని ఛేదించ లేరని అనగా, సౌభద్రుడు రౌద్ర రసో ల్లసిత మూర్తియై, మహార్ణవమున తిరుగు మందర నగములా, కాననమున జరియించు తీవ్రానలమువలె విజృం భించాడని అంటాడు తిక్కన. ద్రోణుడు కృపాచార్యునితో విజ యాత్మజుని రణకౌశలం మెచ్చు కుంటాడు. కవచధారణమను విద్య గల ఈ అభిమన్యుని వంచనవల్ల తప్ప వేరు విధంగా జయించడం సాధ్యం కాదని, ఆ 'గురుడే అశ్వం బుల గూల్చెను. కృపుడు చంపె సారధి....' రథ చక్రంతో వీర విహారం జరిపిన అభిమన్యుడు, దుశ్శాసన సుతునితో తలబడతాడు. ఇరువురూ ఏకకాల మందు మరణిస్తారు. కొలను లో స్నానం చేస్తున్న ఏనుగని కృప మాలిన బోయలు చంపినట్టుగా కౌరవ సేన అభిమన్యుని చంపినదట. అంతే గాని, బ్రూటస్ సీజర్‌ని చివరి పోటు పొడిచినట్లుగా, కర్ణుడు అభిమన్యుని కడతేర్చలేదు.... ఒక జాతి సంస్కృ తికి చెందిన ఇతిహాసాలనుంచి కథలు ఎన్నుకుంటున్నప్పుడు, ఆ కథా సం విధానం మాతృకకు కొత్త మెరుగులు తెచ్చేవిగా వుండాలి గాని ప్రేక్షకాభి రుచిని వక్రీకరింపజేసేది కాకూడదు. అభిమన్యుడు తన వేడి రక్తంగురించి యుధిష్ఠరుని ముందు మాట్లాడటం వాచాలత్వం అనిపించుకుంటుంది తప్ప పాత్రోచితం కాదు. ఈ చిత్రం లోని వీరాభిమన్యుడు చాలా భాగం ప్రణయాభిమన్యునిగానే పొద్దు పుచ్చు తాడు. ఉత్తరాభిమన్యులుగా కాంచన, శోభన్‌బాబు తమ పాత్రలను సమర్థ వంతంగా పోషించారు. యన్‌టి రామా రావు, కాంతారావు, రాజనాల, పద్మ నాభం మొదలైన వారి తారాబలం గల ఈ పిక్చర్, అర్థికంగా విజయవంతం కావచ్చు గాని రసాత్మకంగా తగు స్థాయి నందుకోలేకపోయింది. యుద్ధ దృశ్యాల చిత్రీకరణ, ఘటోత్కచుని మాయాజాలం శ్రమకు తగ్గ ఫలితాన్నీ యడంలేదు. సంభాషణలు గంభీరంగా ఉన్నాయి. పాటలూ సంగీతమూ యితివృత్తానికి తగ్గట్టుగా ఉన్నాయి. ఈ చిత్రానికి దర్శకులు: వి మధు సూదనరావు.

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి' నవంబరు 1965



# మానవ ప్రగతి

## జన్యురహస్యం

మానవ శరీరంలోని జన్యు వ్యవస్థ ఆనుపానులన్నిటిని కనుగొని, మనిషి దేహానికి చెందిన రసాయనిక రహస్యాలన్నిటినీ తెలుసుకునేందుకు అమెరికా జాతీయ ఆరోగ్యసంస్థ 300 కోట్ల డాలర్లతో ఒక మహత్తర కార్యక్రమాన్ని చేపట్టింది. లేజర్లు, కంప్యూటర్లు లాంటి అత్యాధునిక ప్రక్రియలను వినియోగించడం ద్వారా ఈ పరిశోధనా కార్యక్రమంలో శాస్త్రవేత్తలు మానవ శరీరంలోని జన్యు వ్యవస్థకు చెందిన (మొత్తం 1,00,000) జన్యువులన్నింటినీ గుర్తించ వచ్చునని ఆశిస్తున్నారు. ఈ మహత్తర కృషి గనుక విజయవంతమైతే జన్యు సంబంధమైన సుమారు 3,000 వ్యాధులకు నూతన చికిత్సా విధానాలు అందుబాటులోకి రాగలవు. ఇంతవరకు మానవ దేహంలోని జన్యువులలో 4,550 జన్యువులను మాత్రమే గుర్తించగలిగారు. 'జెనోమ్ ప్రాజెక్టు'కి సంబంధించిన 'మాలిక్యులర్ బయాలజీ,' 'బయో టెక్నాలజీ' లలో పారిశ్రామిక, వర్ధమాన దేశాల శాస్త్రవేత్తలకు శిక్షణా సంబంధిత 'ఫెలోషిప్' లిస్తారు. ఇది వైద్య, ఔషధ, వ్యవసాయ రంగాలలో పురోభివృద్ధికి దారి తీస్తుంది.

## కుంజ్రు

నేషనల్ లిబరేషన్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా, గోపాలకృష్ణ గోఖలే స్థాపించిన సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీల ద్వారా భారత రాజకీయాలలో ప్రముఖపాత్ర వహించారు పండిట్ హృదయనాథ్ కుంజ్రూ. ఈయన గ్రూపులో ఇంకా, శ్రీనివాస శాస్త్రి, శివస్వామి అయ్యర్, తేజ్ బహుదూర్ సప్రూ, జయకర్, గోవస్టీ జహంగీర్ మొదలైన ప్రముఖులుండేవారు. 1910 మింటో మార్లె సంస్కరణలు, 1921 మాంటేగ్ - చెమ్స్ఫర్డ్ సంస్కరణల సందర్భంగా ఈ బృందం వారు నిర్వహించిన పాత్ర అనన్యసామాన్యము. 19వ శతాబ్దపు గ్లాడ్‌స్టోనీయన్ లిబరల్స్ నుండి, ఈ శతాబ్దపు ప్రారంభంలో బ్రిటన్‌ను

పరిపాలిస్తున్న లిబరల్ పార్టీ విధానాల ననుసరించి, వీరు తమ రాజకీయ సిద్ధాంతాల నేర్పాటు చేసుకున్నారు. 1920 ల ప్రాంతంలో సత్యాగ్రహాల రూపంలో, 1930 లలో సహాయ నిరాకరణోద్యమాల ద్వారా గాంధీజీ ప్రథమంగా భారత రాజకీయాలలో ప్రత్యక్ష చర్యలను ప్రవేశపెట్టారు. అయితే చిత్తరంజన్ దాస్ నేతృత్వం లోని ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ 1920-30 మధ్య కాలానికి 'కౌన్సిల్ ఎంట్రీ'ని ప్రారంభించడం వల్ల గాంధీజీ సత్యాగ్రహాలు అప్పటిలో ఎక్కువ ప్రభావం చూపలేకపోయాయి. గాంధీ - ఇర్విన్ ఒప్పందం ఒకరూపు దాల్చడానికి సప్రూ, జయకర్‌లు ఎంతో కృషిచేయటమే కాక, 1931 లో లండన్‌లో రెండవ రౌండ్ టెబుల్ సమావేశానికి హాజరుకావటానికి గాంధీ జీని ఒప్పించటంలోకూడా కృతకృత్యు లయ్యారు. 30 సంవత్సరాల పాటు ఆ నాటి భారత రాజకీయాలలో హెచ్చు ప్రభావం చూపిన వ్యక్తిగా పండిట్ హృదయనాథ్ కుంజ్రూను

## 'కొలైడర్'

ప్రపంచంలోకెల్లా అతి పెద్దదైన 'సూపర్ కొలైడర్'ని టెక్సాస్‌లో నిర్మించాలనుకుంటున్నారు. ఈ అత్యాధునికమైన 'న్యూక్లియర్ పార్టికల్ యాక్సలరేటర్' నిర్మాణం ద్వారా 'హై ఎనర్జీ ఫిజిక్స్' రంగంలో అధిపత్యం వస్తుంది 'సూపర్ కండక్టింగ్ సూపర్ కొలైడర్' లో అణువులు మహాద్భుత వేగంతో పరిభ్రమిస్తూ ఢీకొనడం వల్ల అతి సూక్ష్మమైన పరమాణువులు ఉత్పన్నమవుతాయి. వీటిని పరిశీలించడం ద్వారా 'పదార్థం' ఆవిర్భావాన్ని గురించి, దాని సహజ ధర్మాల గురించి మరింతగా తెలుసుకోవచ్చు. ☀



తొందరగా గమ్యం చేరుకోవాలని గాక ఎక్కడికి వెళ్తున్నామో తెలుసుకోవాలి. హడావిడి పడటానికీ, లక్ష్య సాధనకు చాలా తేడా ఉంది. —న్యూకుంబర్

పాదు పెరిగినట్లుగా మత విశ్వాసాలు పెరిగిపోయి, పిందెలాటి దేవుని దాచేస్తాయి. —స్టువార్డ్

ఆగ్రహావేశమెప్పుడూ నోరు తెరిచి, కళ్లు మూసుకుంటాడు. —కాటో

నమ్మనిది నమ్మినట్లుగా చెప్పడమే దగుల్బాజీతనం. —పెయిన్

తను చేసేది బయటపడదని విస్పష్టంగా తెలిసి కూడా, ఏవిధంగా నడుచుకుంటాడో, అదే అతని నిజాయితీకి కొలమానం. —మెకాలే

తప్పు బట్టేందుకెవరూలేని మీదటనే, తమ తప్పు వొప్పుకుంటారు చాలామంది. —పోర్టర్

తమ ఆట బొమ్మలకయే ఖరీదొక్కటే పిల్లలకు, పెద్దలకుగల వ్యత్యాసం. —జాయిస్



సీరియల్

# అన్నపూర్ణా రెడ్డి
# మజిలి



గడిచిన కథ : కళకు అంకితమైన జ్యోత్స్న, తన యిద్దరు పిల్లలని భర్తవద్ద వొదిలి వెళ్లిపోయింది. హౌస్‌కీపరు జానకి వారిని ప్రేమతో పెంచుతోంది. ఉన్నట్టుండి ఒక రోజున డాక్టరు సారథి, ఇంటికి ఒక పేషంటుని పంపడంతో, కలవరం ప్రారంభమయింది.....

ఇక చదవండి

స్వసుఖాన్ని కోరుకొని.... కన్న బిడ్డలను సైతం లెక్కచేయక వెళ్ళి పోయిన జ్యోత్స్న గుర్తొచ్చింది.

వెంటనే మనసు జాగ్రదావస్థలోకి వచ్చింది. "ఛీ....ఛీ.... ఏమిటీ బలహీనత.... పరిస్థితుల ప్రభావం.... మనసులోని బింకాన్ని సడలిస్తుందిలా వుంది...." తల విదిల్చి లేచి నుంచున్నాడు.

తలుపు గడియవేసి జానకి వంక చూసాడు. పసిపిల్లలా అమాయకంగా నిద్రపోతోంది. దుప్పటి తీసి కాళ్ళ మీద కప్పి .... ఓ మారు పిల్లల గది లోకి వెళ్ళి.... చెదరిపోయిన దుప్పట్లు సరిగా కప్పి రంగనాథ్‌ను చూచి .... తన గదిలోకి వెళ్ళిపోయాడు. దూరాన ఎక్కడో కోడి కూత విన్పించింది.

## 22

బాల భానుడు నును లేత కిరణాలతో గిలిగింతలు పెడుతూ ప్రకృతికి మేల్కొలుపులు పాడుతున్నాడు.

తమ ఇంట్లో వున్న దయ్యం ఏమయిందో అని పిల్లలు ఆదరా బాదరా లేచి కూర్చున్నారు. నారాయణ జారి పోతున్న ఇలాగు జారకుండా ఓచేత్తో పట్టుకొని డాక్టరుగారింట్లో దూరిపోయి "దెయ్యం లేచింది" అన్నాడు.

సారథి.... వ్యాహ్యాళి ముగించుకొని అప్పుడే వసారా మెట్లెక్కాడు.

నిద్రప్రభావంవల్ల, కలత దేరిన జానకి మనసు, ప్రశాంతంగా వుంది.

మంచం మీద పడుకున్న రంగనాథ్ తనెక్కడ వున్నదీ తెలియక అయోమయంగా చూస్తున్నాడు.

"హల్లో, ఎలావుంది ?" పలుకరించాడు సారథి.

"బాగానే వుంది.... నేనెక్కడున్నాను ?" అడిగాడు రంగనాథ్. పిల్లలు కుతూహలంగా గడపలో నుంచున్నారు.

"మా ఇంట్లో వున్నారు.... కంగారేం లేదు.... లేవగలరా.... పళ్లు తోముకుందురుగాని"-చొరవగా బదులిచ్చాడు సారథి.

పాలు తెచ్చిన పాలేరు చేయూత నీయగా లేచి వసారా అంచున కూర్చొని పళ్ళుతోముకొని లోపలికొచ్చాడు రంగనాథ్.

కాఫీ తెచ్చి మంచం ప్రక్కగా పెట్టి లోనికి తప్పుకుంది జానకి.

కాఫి నెమ్మదిగా గుటకవేస్తూ "నేనిక్కడి కెలా వచ్చాను ? .... మీ రెవరో తెలుసుకోవచ్చా ?"

ప్రార్థనా పూర్వకమైన అతడి విన్నపము విని "నా పేరు సారథి ... ఈ వూరులో పి. హెచ్. సి లో డాక్టరుని .... మూడు రోజుల క్రితం .... దెబ్బలతో ఒళ్లు తెలియని స్థితిలో వున్న మిమ్మలను ఎవరో పి హెచ్ సి లో తెచ్చి పడేశారు. అక్కడ చోటు లేక ఇక్కడ పెట్టి ట్రీట్ చేయాల్సి వచ్చింది." క్లుప్తంగా వివరించాడు సారథి.

రంగనాథ్ కళ్ళలో కృతజ్ఞత కదులాడింది.

"దేవుడిలా ఆదుకున్నాడు .... లేక పోతే .... ఆదెయ్యం...." విషాదంగా నవ్వాడు రంగనాథ్.

దెయ్యం మాట వినగానే పిల్లలు ముగ్గురూ ముఖాలు చూచుకున్నారు.

"రెస్ట్ తీసుకోండి .... వస్తాను .... టైమౌతుంది" అంటూ లోనికి వెళ్ళాడు సారథి.

అదే అదనని .... నారాయణ మంచానికి చేరువగా వచ్చి ...."నీవు .... దెయ్యం కాదా .... చక్కామాట లొచ్చే .... పేరేంది ?" .... నడుం మీద చేతులుంచుకొని ధీమాగా అడిగాడు.

"పేరు రంగనాథ్ .... దెయ్యాన్ని కాదులే .... మరె నీపేరు ?"

"నారాయణ .... మరేమో అతడి పేరు .... రవి .... ఆమె పేరు ఫిజ్జి" అందరి తరపునా తనే బదులిచ్చాడు నారాయణ.

"ఏం చదువుతున్నారు ?"

వరుసనే చెప్పారు.

"బాబూ .... పాపా ...." లోపల నుండీ పిలుపు వచ్చింది.

"అమ్మో ఫిన్ని .... స్కూల్ టైమండి .... మళ్ళీ వస్తాం.... నీ వెళ్ళకేం ...." అన్నాడు నారాయణ.

"లేదు .... వెళ్ళను ...." నవ్వుతూ భరోసా ఇచ్చాడు రంగనాథ్.

ప్లేటులో ఇడ్లీ, గ్లాసుతో నీళ్లు తెచ్చి చిన్న స్టూలు దగ్గరగా లాగివుంచి వెళ్ళి పోయింది జానకి.

అలసటగా కళ్లు మూసుకున్న రంగనాథ్ ఆ చప్పుడుకు కళ్ళు తెరిచాడు. వేడి వేడి ఇడ్లీ నోరూరిస్తూంది. నెమ్మదిగా దిళ్ళనానుకొని కూర్చొని టిఫిను తిన్నాడు.

ఎక్కడ వాళ్ళక్కడ వెళ్ళిపోయినట్టు ఇంట్లో సందడి తగ్గిపోయింది.

ఆ పూట ఆర్డర్లీ వచ్చాడు.

"నీవు హాస్పిటల్‌కి వెళ్ళిపో .... ఇక్కడ అవసరం లేదులే" అంటూ అతణ్ణి వెనక్కి పంపించేసింది జానకి.

ఆ పూటకు పత్యం పెట్టింది జానకి తల వాల్చుకొని. బిడియపడుతూ

పత్యం తిని, గదిలోనే వుండిపోయాడు రంగనాథ్ ....

రెండు రోజుల్లో రంగనాథ్ బాగా కోలుకున్నాడు. పిల్లలు బాగా మాలిమి అయ్యారు - ఇక నారాయణ సరేసరి.

జుట్టు కత్తిరించుకొని మాసిన గడ్డం షేవ్ చేసుకొని స్నానం చేసి క్రొత్త బట్టలు వేసుకున్న రంగనాథ్‌లో చెప్ప లేనంత మార్పిడి.

ఆవేళ ఆదివారము కావడం వల్లా పైగా ఫేమిలీ ప్లానింగ్ వీక్ అయి పోవడం వల్లా తీరికగా ఇంటి పట్టునే వుండిపోయాడు సారథి.

పేపరు తిరగేస్తూ హాల్లో తీరికగ కుర్చున్న సారథి ప్రక్కనే రంగనాథ్ నుంచున్నాడు.

"కమాన్ .... మిస్టర్ రంగనాథ్ .... కూర్చోండి." మరో కుర్చీ చూపించాడు సారథి.

థాంక్స్ చెప్పి బిడియంగా కూర్చున్నాడు.... గొంతు సవరించుకుంటూ.

"నేను వెళ్ళిపోదామను కొంటున్నాను సార్ .... మానవత్వమున్న వ్యక్తి చేతుల్లో పడ్డాను .... మనిషిగా బ్రతికి బయట పడ్డాను .... ఈ జన్మ లోనే కాదు .... ఎన్ని జన్మ లెత్తినా మీ రుణం తీర్చుకోలేను" - వినయంగా చెప్పాడు రంగనాథ్.

"నో .... నో .... నో.... ఇందులో నా గొప్ప ఏమీలేదు...." అసమయం .... మీ స్థితి అలాటిది ...." కొట్టి పారేశాడు డాక్టరు.







"అలాగనకండి సార్, .... మంచి వారెప్పుడూ తమ గొప్పను అంగీ కరించరు .... ఏది జరిగినా మన మంచికేనని మా మాస్టారు చెప్పేవారు .... అందుకే .... దారినపోయే నన్ను .... అకారణంగా ఎవరో అటకాయించి డబ్బులూ .... వాచీ అడిగారు .... నాదగ్గర లేవన్నాను .... సోదా చేశారు .... ఆ తరువాత .... సన్నాసి వెధవ .... బలే కేసు తగిలింది తల రాత కొద్దీ - అంటూ ఇద్దరూ కలిసి తన్నారు.... తరువాత ఇక్కడి స్పృహ తెలిసింది."

"మా హాస్పిటల్ సిబ్బంది ప్రక్క వూరు నుండీ తిరిగివస్తూ దారిలో పడివున్నాడంటూ తీసుకొచ్చారానాడు. ఆల్ రైట్ .... జరిగి పోయింది పోనివ్వండి ఎవ్రిథింగ్ వెంటాఫ్ వెల్ కానీ ఇంకా నాలుగు రోజులు ఇక్కడే వుండి రెస్ట్ తీసుకోవడం మంచిదని నా అభిప్రాయం !"

"కాదండీ".

"ఫరవాలేదు మిస్టర్ !"

ఆ విషయాన్నిక పొడిగించడం ఇష్టంలేనట్టు వ్యక్తం చేశాడు.

తన సదుపాయాలు చూస్తున్న వ్యక్తిని లీలగా చూచిన రంగనాథ్, తిరిగి ఆమె తారసపడితే కృతజ్ఞతలు చెప్పుకోవాలనుకున్నాడు.

ఫోంచేసి, పొరుగూరివారు జీప్ పంపిస్తే వెళ్ళిపోయాడు సారధి. పిల్లలు ఆడుకుందుకు చెట్టు క్రిందకు వెళ్ళారు.

రంగనాథ్.... ప్రొద్దు ఏటవాల గానే వ్యాహ్యాళికి వెళ్ళాడు ....

ప్రశాంతంగా హాల్లో కూర్చుంది జానకి ....

డాక్టరుతో రంగనాథ్ ఉదయం అన్న మాటలే పదే పదే గుర్తొస్తున్నాయి.

ఎదుటివాళ్ళ జీవితాలతో ఆడు కోవాలనుకునే వ్యక్తులకు ఈలాగే ఎక్కడో ఒక దగ్గర శాస్తి జరుగు తూంటుంది .... మెత్తగా తన్ని, ఎక పిసికేసి వుంటే బావుండేది.... అత పిల్లలను మాయ మాటలతో మోసం చేసే వ్యక్తుల్లో ఒక్కరయినా తగ్గివుండే వాడు .... హృదయంలో అతడి ఎట్ల పేరుకుపోయిన ద్వేషాన్ని అసహ్యాన్ని తలపుల్లో వెడల గ్రక్కుతూ ఆలో చనలో పడిపోయింది....

ఆ రోజు .... రౌడీలు తన వెంట పడ రోజు ఈ డాక్టరింటి గుమ్మం తెరిచి లేకపోతే .... తనెక్కడ వుండేది ?.... ఆపై .... ఆలోచించలేక .... లేదు .... లేదు .... చెవులు గట్టిగా మూసు కొని 'వీల్లేదు' అంటూ అరిచింది.

వ్యాహ్యాళి కెళ్ళి తిరిగివచ్చిన రంగ నాథ్ హాల్లో జానికిని చూచి తన కళ్ళను నమ్మలేకపోయాడు.

జానకి .... ఇక్కడ .... డాక్టరు గారింట్లో అవునా.... కాదా అన్న సం దేహంతో కాస్సేపు కొట్టుమిట్టాడాడు .... గుమ్మం అవతలా నుంచున్నాడు.

తను ఎరిగున్న జానకి ముగ్ధ .... అమాయికత్వం తొణికిసలాడే లేజవ్వని .... ఈ జానకి ముఖంలో నిబ్బరం .... అమాయికత్వం స్థానే .... ఏదో ధైర్యం .... చూపుల్లో స్థిరత్వం.... జానకిని చూచాక అతడి

ముఖంలో సంతోషం పొంగులు వారింది ....

"జానకీ...." అంటూ ముందుకడుగు వేయబోయాడు .... అంతలోనే పిల్లలు 'పిన్నీ, పిన్నీ' అంటూ పిలవడం గుర్తొచ్చి అడుగు వెనక్కు వేశాడు. పొటమరించిన సంతోషం కాస్తా అంతరించింది.

గభుక్కున తలెత్తి చూచిన జానకి ఎదుట రంగనాథ్ అవుపించగానే లోనికి తప్పుకోవాలనుకుందే కాని కదలేక పోయింది. అయినా నీతో నాకేం - అన్న ధీమాతో కూర్చుంది.... అమె కళ్ళల్లో అంతులేని అసహ్యం.

"జానకీ" .... సంభ్రమంగా పిల్చాడు రంగనాథ్.

"అవును ....ఏం .... జానకినే .... నీ స్మృతి పథంలో ఇంకా నిలిచి వుందనా ?" - విదల్చివేసింది....

"జానకీ...." ఎందుకంత నిష్ఠూరం

"ఏం ?"

"క్షమించు జానకీ .... నిజం .... తెలిస్తే .... నీవు .... ఇంత లేసి వాడి మాటలతో బాధించవు...."

"ఏమిటా నిజం .... తల్లి తండ్రుల చాటు పిల్లను ప్రేమ పేరున గడప దాటించ లేదనా ?.... నిస్సహాయ స్థితిలో వదలి వెళ్ళిపోలేదనా ? .... వెళ్ళిపోయి ముఖం.... చాటెయలేదనా ? ....ఏళ్ళ తరువాత ఎదుటపడి .... చేసిన పొరపాటును తెలివిగా సమ







ర్థించుకో చూడ్డం లేదనా .... ఏమిటా నిజం ?" .... ఆవేశంగా పలికింది.

"ప్లీజ్ జానకీ...." ఆవేశంగా ముందుకొచ్చాడే గానీ మళ్ళీ .... ఏదో గుర్తొచ్చిన్న వాడిలా .... అక్కడే నుంచున్నాడు.

"ఈ ఇంటికి నీకు గల అనుబంధం నాకు తెలియదు .... కానీ .... నా మనసులో వున్నమాట.. నీవు వినేతీరాలి - నేను చెప్పేతీరాలి .... ఈ జీవితంలో ఈలా తారసపడి నిన్ను చూస్తానను కోలేదు .... ఇది నా పాలిట పెద్ద వరంగా భావిస్తాను...."

తిరస్కారంగా చూచింది జానకి....

"నీ ఎక్స్ ప్లనేషన్ నాకనవసరం ?" అంటూ లేవబోయింది....

"ప్లీజ్ జానకీ .... నీకు అనవసరమయినా .... నాకు అవసరము .... నాకు ఇది జీవన్మరణ సమస్య .... ఈ కాస్త సదవకాశాన్ని జార విడుచుకొంటే నా జీవితానికిక మోక్షం లేదు .... ఇప్పటికే మానసికంగా, శారీరకంగా కృంగి కృశించిపోయాను ....

అతడి కళ్ళల్లో అభ్యర్థన, మాటల్లో వేడికోలు చూచి ముఖం తిప్పేసుకుంది.

## 23

గుమ్మాని కావతే గోడనానుకొని నేలమీద చతికిల పడ్డాడు రంగనాథ్.

"జానకీ .... ఆరోజు ... నిజంగా దురదృష్టపు రోజు .... నిన్ను వదిలి ఉద్యోగాన్వేషణలో వెళ్ళిన నాకు మా మేనమామ వచ్చి వీధిలో అమాంతం వాటేసుకున్నాడు. 'ఒరే..... ఒరే .... అదేదో ఊళ్ళో ఉద్యోగమన్నారు .... అక్కడికెళ్ళితే వెళ్ళి పోయావన్నారు.... నీవు ఇంటికొచ్చి ఎన్నాళ్ళయింది .... ఎక్కడున్నావు ? ఏం చేస్తున్నావు ?....' అంటూ ఓ ప్రక్క కుశలప్రశ్నలేస్తూనే ... హొటలు దాకా లాక్కెళ్ళాడు. ఇంట్లో అందరి విషయాలూ అడుగుతూ కాస్సేపు అక్కడే కూర్చున్నాను.... ఆ తరువాత లేచి "వస్తా మామయ్యా .... పనివుంది .... ఓ వ్యక్తిని కలుసుకోవాలి" అన్నాను....

"అబ్బాయ్.... తెలీకడుగుతాను - ఉజ్జోగానికేనా.... అయితే పదా.... నేనూ వస్తాను .... ఈ ఊళ్ళో మనకు తేలీని వాడెవడున్నాడు".... అంటూ వెంటపడ్డాడు ....

"కాదులే మామయ్యా .... నన్ను వెళ్ళనీ...." ప్రాధేయ పడ్డాడు.

"పదరాసన్నాసీ .... ఉద్యోగం ఎవడిక్కావాలి .... నీసంపాదన ఎవడిక్కావాలి .... అక్కడ మీ అమ్మ నీ టావురికాణా తెలియక మంచమెక్కింది. నీఅయ్య చిందులు తొక్కుతున్నాడు. వాళ్లకు కనపడివచ్చేద్దు కాని" అంటూ బలవంతంగా రిక్షాలో తోసి ఎక్కి కూర్చున్నాడు. ఆఫీసరు మాట అటుంచి నీవు గుర్తొచ్చి రిక్షా లోంచి క్రిందికి గంతేశాను .... "వీల్లేదు .... ఇప్పుడుకాదు .... రెండు రోజుల్లో నేనే వస్తాను అని వెనక్కు తిరిగి చూడకుండా పరుగు లంకించుకున్నాను.... "అయ్యా ! .... బాబూ" .... మావాణ్ణి .... ఆపండి ....

వాడికి మతిస్తిమితంలేదు పారిపోతున్నాడు ... బాబూ .... పట్టుకోండి" అంటూ రిక్షాలోంచి కేకలుపెట్టాడు మామయ్య .... ఈలాటి ధర్మకార్యాలకు ఎక్కడి కక్కడే సహాయాన్నందించే ప్రబుద్ధులు ఇద్దరు నన్ను వాడిసి పట్టుకున్నారు. గింజుకున్నా .... అరచినా లాభంలేక పోయింది. పోగా .... నేను పిచ్చోడి క్రింద జమ అయ్యాను. నా మనసులో పడే గుంజాటన, బాధను ఎవరు అర్ధంచేసుకుంటారు - .... ఉదయం గుమ్మంలో నన్ను సాగనంపులే నుంచున్న నీ ముఖమే గుర్తొస్తుంటె .... పిచ్చివాడి లాగే అరిచాను. రైల్లోకి బలవంతంగా నెట్టి అందరికీ నేను పిచ్చివాడినని చెప్పి అందరి సహాయ సహకార సానుభూతి పర్తిస్తూ నన్ను ఇల్లు చేర్పించాడు మామయ్య.

ఇక ఇంటిలో నామాటకు విలువ లేకుండా పోయింది.. మామయ్య విలువలు పలువలు కల్పించి చెప్పి, తన ఘనకార్యాన్ని పదిమందికీ చాటుకున్నాడు.

పక్షం రోజులువరకూ .... తలకు నిమ్మకాయరసం తోటిమర్దనా, చన్నీటి స్నానం .... దాంతో న్యుమోనియా వచ్చి హాస్పిటల్ పాలయ్యాను ....

ఆరోగ్యవంతుణ్ణయ్యాక తప్పించుకొని రాజమండ్రీ చేరిన నాకు ఇల్లుగలావిడ నీవు బెజవాడకు వచ్చావని చెప్పింది.

"బాబూ! .... అమ్మాయి, నీవు రమ్మని వ్రాసినట్లు, చెప్పిందే? ....







రాలేదా ? ...." అంది ? ఆవిడకు సమాధానం చెప్పేస్థితిలో లేను.... నీకు ఉత్తరం రావడం కూడా కుట్రలో ఒక భాగం కాదుకదా అన్పించింది .... నేరుగా మీ ఇంటికి వెళ్లాను .... తమకు తెలియదన్నారు మీవాళ్లు .... నాటినుండీ .... నేటిదాకా .... నీకోసం అన్వేషిస్తూ తిరుగు తున్నాను ....

చెప్పడం ఆపి అలసటగా కళ్లు మూసుకున్నాడు రంగనాథ్.

"అనాదిగా మగవాడిదేపైచేయి. ఏం చెప్పినా ఏం చేసినా చెల్లుతుందన్న ధీమా వుంది కాబట్టి అంతధైర్యం .... బహుశా మీ అన్వేషణ ఫలించి మీ బరువు బాధ్యతలు దిగిపోయాయి కాబట్టే .... నిశ్చింతగా బ్రతకవచ్చు .... దయవుంచి .... ఇప్పటికైనా మీకట్టు కథ చాలిస్తారా మిస్టర్ రంగనాథ్ ...." రోషంతో ఎరుపెక్కిన జానకి కళ్ళను చూచి తలవాల్చుకున్నాడు రంగనాథ్.

"జానకీ .... ఎంత మాటన్నావు ?" ....బాధగా ధ్వనించా యా పలుకులు.

"లేకపోతే నమ్మమన్నారా .... నమ్మినా నమ్మకపోయినా .... మీ కొచ్చిన ఇబ్బందేం లేదుగా" ....

"జానకీ ...."

"చూడు మిస్టర్ .... వేలాం వెర్రిగా నీవెంటవచ్చిన జానకి ఏనాడో చని పోయింది.... అది గుర్తుంచుకో" .... లోనికి వెళ్ళిపోయింది జానకి.

## 24

రోజులు గడిచిపోతున్నాయి. ఓ సాయంత్రాన .... చెంపకు చేయిచేర్చి గోడకుజేరగిలబడి కూర్చున్న జానకిని సాలోచనగా చూస్తూ "జానకీ" అని పిల్చాడు సారథి.

ఉలిక్కిపడి తలెత్తింది జానకి....

"ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచి స్తున్నావు ?"

"అబ్బే.... నేనా.... నాకేం ఆలోచన ?"

"మరి నాలుగుసార్లు పిలిచాను...." అన్నాడు సారథి....

"వినిపించలేదు...." మెల్లగా బదు లిచ్చింది.

"మాట విన్పించనంత పరధ్యానం అంటే.... అదేదో.... పరవశత్వం అయివుండాలి. లేదా.... ప్రపంచాన్ని ఉద్ధరించే సమస్య అయినా అయి వుండాలి.... లేదా...." - మాట పూర్తి కాకముందే....

"ఏదీలేదు .... విన్పించ లేదు...."

"అదే.... ఎందుకూ అని...."

"నీవు రంగనాథ్ గురించి ఆలో చిస్తున్నావు కదూ ?.... "

"నేనా ? .... అతగాడి గురించి ఆలోచించే పని తప్పా వేరేమిలేదా " .... ముఖంలో.... ఎలాటి భావాలు అవుపించనీయలేదు.

"జానకీ .... నీలో చాలా మార్పు అవుపిస్తూంది .... చాలా స్తబ్ధంగా వుంటున్నావు .... నీలో .... ఈ మార్పిడి కి కారణం రంగనాథేమో అనుకొంటున్నాను."

(ఇంకా వుంది



"రెండు పదుల వ్యక్తులు కేంద్రంలో కూర్చొని పనిచేయడంద్వారా నిజమైన ప్రజాస్వామ్యం లభించదు. అట్టడుగు స్థాయినుండి ప్రతి గ్రామంలోని ప్రజలు దీనికై కృషిచేయాలి".

—గాంధీజీ

# ప్రజలకు అధికారం

ముఖ్యమైన అంశాలు

పంచాయితీ రాజ్ బిల్లు :

* గ్రామ, బ్లాకు, జిల్లా స్థాయిలలో పంచాయితీలు.
* ఈ మూడు స్థాయిలలో అన్ని స్థానాలకు ఎన్నికల సంఘ పర్యవేక్షణలో ప్రత్యక్ష ఎన్నికలు.
* పదవీకాలం — 5 సంవత్సరాలు. ఏదైనా ఒక పంచాయితీ ముందుగా రద్దయితే, ఆరు నెలలలోగా ఎన్నికలు జరగాలి.
* షెడ్యూల్డు కులాలు/షెడ్యూల్డు తెగలకు జనాభాలో వారి నిష్పత్తినిబట్టి స్థానాల కేటాయింపు.
* స్త్రీలకు 30 శాతం కేటాయింపు.
* ప్రాంతీయ అభివృద్ధి ప్రణాళికలను సామాజిక న్యాయానికి లోబడి రూపొందించి అమలుపరిచే అధికారం.
* పంచాయితీ తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించటానికి తగిన నిధులు

నగరపాలిక బిల్లు :

* మూడు రకాల నగరపాలికల స్థాపనకు ఏర్పాటు—నగర పంచాయితీలు. పురపాలక సంఘాలు. పురపాలక కార్పొరేషన్లు.
* ఎన్నికల సంఘ పర్యవేక్షణ క్రింద ప్రత్యక్ష ఎన్నికలు—పదవీ కాల పరిమితి ఐదు సంవత్సరాలు.
* ఏదైనా పురపాలక సంఘం ముందుగా రద్దయితే ఆరు నెలలలోగా ఎన్నికలు జరగాలి.
* ప్రజా సేవా తత్పరులైన వ్యక్తులు తమ ప్రాంతంలో పనిచేయడానికి వీలుగా వార్డు కమిటీల ఏర్పాటు.
* ప్రాంతీయ వ్యవస్థలకు తగిన అధికారాన్ని ఇవ్వడం.
* ప్రణాళికలను రూపొందించడంలో వారికి ఎక్కువ పాత్ర.
* పురపాలక సంస్థలకు తగినంత ఆర్థిక సదుపాయం.

**అభివృద్ధిని, ప్రజాస్వామ్యాన్ని ప్రజల ముంగిట్లోకి తీసుకుని వచ్చే విప్లవాత్మకమైన చర్యలు**

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కె యన్ కేసరి



'గృహలక్ష్మి' కంకణ గ్రహీతలైన తెలుగు వనితలు ఈనాడు ఎందరో ఉన్నారు. 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా స్త్రీజనాభ్యుదయానికై కేసరిగారు చేసిన అద్వితీయ కృషి తెలుగువారు మరువ లేనిది. అలాగే కేసరీ కుటీరం, కేసరీ విద్యాలయం వంటివి, ఆయన పేరు చిరస్థాయిగా నిలిపే సంస్థలు. ఆత్మబలం, స్వయంకృషి, అచంచల దీక్షతో, వైద్య శాస్త్రంలోని ప్రతిభను ప్రజోపకరంగా మార్చి, సేవా తత్పరతతో చరితార్థులైన కేసరిగారు తమ జ్ఞాపకాలను పుస్తకరూపంలో 1953 లో వెలువరించారు. ఆదర్శ ప్రాయులు, పుణ్యజీవనులు అయిన ఆ మహానుభావుని జీవిత విశేషాలు ఆనాటి సాంఘిక పరిస్థితులకి దర్పణం వంటి అనుభవాలు - జులై నెల నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

## రైల్వే ఆడిట్ ఆఫీసు

ఇప్పుడు సెంట్రల్ స్టేషనుకు ప్రక్కన కట్టియున్న (M.S.M.) మదరాస్ అండు సదరన్ మహారాష్ట్ర రైల్వే ఆడిట్ ఆఫీసు కట్టడము ఇతర కట్టడములు కట్టినదికూడ నాకు తెలుసును. ఈ ప్రదేశమున ముందు పార్కు (తోట) యుండినది. ఈ కారణమువల్లనే ఈ ప్రాంతమునకు పార్కుటవున్ (Park Town) అని పేరు వచ్చినది. ఈ కట్టడము ప్రక్కననే పార్కుటవున్ పోస్టాఫీసు కట్టడము కలదు. ఈ రైల్వే ఆడిట్ ఆఫీసుకూడ తాటికొండ నంబెరు మాళ్ల శెట్టిగారే కంట్రాక్టుకు తీసుకొని కట్టించిరి. సెంట్రల్ స్టేషన్ ఆరంభమున కట్టినది నాకు తెలియక పోయినను పిమ్మట క్రమముగ దానికి చేర్చికట్టిన ప్లాటుఫారములు వగైరాలు నాకు దెలియును. ముందు పాతస్టేషన్ రాయపురమున నుండినది.

## రిప్పన్ భవనము, ఇతర కట్టడములు

ఇప్పటి మద్రాసు కార్పొరేషన్ (రిప్పన్) భవనమును కట్టుచుండినప్పుడు నేను సుగుణవిలాస సభ మెంబరుగ నుండి దానిని కట్టిన విధమును చూచుచుంటిని. అప్పుడు సుగుణవిలాససభ దానిప్రక్కనయుండు విక్టోరియా పబ్లిక్ హాలు (V.P. Hall) నందుండెను. పాతమునిసిపలు ఆఫీసు, జార్జిటవున్ యర్రబాలుశెట్టివీధిలో యుండెను. ఇప్పుడు బీచిలోయున్న కొత్త నేషనల్ బాంకి కట్టడ ముండు స్థళమున సింగ్లర్ స్కూలు (Singler School) ఉండెను. ఈ నేషనల్ బాంకిని, ఇప్పటి ఇంపీరియల్ బాంకిని (ముందు మద్రాసు బాంకి) కట్టినదికూడ నాకు తెలుసును. పాతనేషనల్ బాంకి ఆర్మీనియన్ స్ట్రీటులోను, మద్రాసు బాంకి బ్రాడ్వేలోను వుండినవి. పోర్టు ఆఫీసుకు సంబంధించిన క్రొత్త కట్టడములన్నియు కట్టినది నాకు తెలుసు. పాత హార్బరును మార్చి ఇప్పుడు కట్టిన నూతన హార్బరును కట్టినదియు నాకు తెలుసును. పాతహార్బరుమీద శనివారము ఆదివారము కొందరము చేరి షికారుకు వెళ్లుచుంటిమి. దీనినే అప్పుడు యినుపవారధి అని పిలుచుచుండిరి. మౌంటురోడ్డులో యుండిన T.R. Tauker & Scons ను (ఇప్పుడు Sree Rama Buildings) స్పెన్సరు కంపెనీ కట్టడమును కట్టినది నాకు తెలియును. పాత యస్. ఐ. ఆర్. స్టేషన్ (S.I.R. Station) ను మార్చి ఇప్పటి కట్టడమును కట్టినది, బీచి స్టేషన్ కట్టినది, మూరుమార్కెట్టును కట్టినది నాకు దెలియును. మద్రాసులో ముందుండిన పాతమార్కెట్టు ఇప్పుడు శ్రీరాముల పార్కు అను స్థళమున బ్రాడ్వేలో

మండెను. ఇప్పటి లాకాలేజి నేను చూచుచుండగ కట్టినదే. ఈ లాకాలేజిని కట్టకముందు B.L. క్లాసులు హైకోర్టు భవనమునందే జరుగుచుండెను. ఆ క్లాసులు ఉదయము 10 గంటల లోపుగనే జరుగుచుండెను. అప్పుడా క్లాసులకు ప్రొఫెసర్లుగ ప్రసిద్ధులగు రామచంద్రరావు సాహేబు, టి. వి. శేషగిరి అయ్యరు, మొరిశెట్టి వెంకట్రామశెట్టిగారు, సుబ్రహ్మణ్యయ్యరు మొదలగు వారుండిరి.

# 10 చెన్నపట్నంలో

## నాటి ముఖ్యులు కొందరు, కొన్ని సంస్థలు, ధర్మ సంస్థలు

## నా బాల్యస్నేహితులగు శ్రీ చెన్నకేశవులు శెట్టిగారు

ఈ శెట్టిగారి తండ్రి అన్నం వెంకటవరదయ్యశెట్టిగారు. వీరు మద్రాసులో పేరు పొందిన వైశ్యులలో గొప్పధనికులు; పేరు ప్రతిష్టలు గలవారు. వీరికి దత్తపుత్రులు ఈ చెన్నకేశవులుశెట్టిగారు. వీరిని గురించి యింతకు ముందు ప్రస్తావించితినిగాని మరల వీరిని స్మరించుచున్నాను. వీరు శివశంకర పాండ్యాగారి స్కూలులో నాకు స్నేహితులయినారు. ఇరువురము ఒకేక్లాసులో చదువుచుంటిమి. నేను వారితోకూడ వారియింటిలోనేయుండి చదువుకొనుచుంటిని. ఇరువురము జోడుగుఱ్ఱాలబండిమీద బడికిపోవుచుంటిమి. వారికి ఆ కాలమున జోడుతెల్లగుఱ్ఱములుండెడివి. వాటిని పెగుపోనీలందురు. మద్రాసులోనుండు వారందరిని ఆ గుఱ్ఱములు ఆకర్షింపచేయుచుండెను. ఇప్పుడు గిడ్డంగివీధి (Varada Muthiappan Street) మొదటియిల్లును, ఆ ప్రక్కనయుండు వక్కలంగళ్లన్నియును వీరివే. ఇంక ననేకయిండ్లు, తోటలునుండెను. వీరియింటిలో అపూర్వములయిన నవరత్నములుండెడివి. శెట్టిగారి చెవు జంపులో చిన్నపచ్చయుండెను. దానినిటాకరు కంపెనివారు రు 15,000 లు యిచ్చి కొనుక్కొనిపోయిరి. ఆ కాలమున టాకరు కంపెనీవారు గొప్పనగల వర్తకులు. వారును యిప్పుడు లేరు. చెన్నకేశవులు శెట్టిగారి తండ్రి చనిపోయెను. తండ్రి చనిపోయినపిమ్మట వ్యాపారములో చాల నష్టముగల్గినది.

వీరికి శ్రీరంగము ఉత్తరవీధిలో యిక మంచిసత్రముండెను. దానికి ఏకాదశీసత్రమని పేరు. ఏకాదశినాడు బ్రాహ్మణులకు యిక్కడ ఫలహారములను పంచిపెట్టుచుండిరి. నేను శెట్టిగారితోకూడ ప్రతివైకుంఠయేకాదశికి

శ్రీరంగనాథస్వామి దర్శనమును చేయుచుంటిని. ఇది నాకును శెట్టిగారికిని కలిగిన స్నేహము.

## మందపాటి రామకృష్ణయ్యగారు

ఆ కాలమున బ్రాహ్మణులలో ప్రసిద్ధికెక్కిన భాగ్యవంతుడు ధర్మాత్ముడు మందపాటి రామకృష్ణయ్యగారు. వీరికి మద్రాసులో అనేక కట్టడము లుండెడివి. అమంజికరెలో ఒక వుద్యానవనమును అందులో దివ్యమైన భవనము నుండెడివి. అప్పుడప్పుడు ఆ తోటకు స్నేహితులతో కూడవచ్చి కేళీవిలాసాదులతో కాలముగడుపుచుండేవారు. వీరు కీ॥ శే॥ విజయనగరం మహారాజా ఆనందగజపతివారికి స్నేహితులు. రాజకళతో నొప్పు వీరు శ్రీ మహారాజావారి సరసన కూర్చుండి, జోడుగుర్రాలబండిలో తిరువత్తియూరు దేవాలయమునకు వెళ్లునపుడు చూడముచ్చటై దారిపొడవున జనము విరుగబడి చూచేవారట, వీరిభార్యగారు ఏడువారములసొమ్ములు, అతివిలువగలవి, ధరించేవారట. వీరికి స్నేహితులు జాస్తికాగా, వారికుండిన ధనాదులు హరించిపోయినవి.

## డాక్టరు వరదప్పనాయుడు

డాక్టరు వరదప్పగారిది బ్రహ్మసమాజపు మతము. సుమారు 6 అడుగుల ఎత్తున ఒడ్డూపొడవుగల భారీమనిషి. పెద్దగడ్డమునుగలవారు. బర్మాయుద్ధములో పని చేసినవారు. వీరు ముఖ్యముగ ప్రసవముల చికిత్సలకు పేరు పొందినవారుగ నుండినను అన్ని వ్యాధులను సమర్థతతో వైద్యము చేయుచుండిరి. చనిపోయిన డాక్టరు రంగాచారికి యుండిన ధర్మబుద్ధి ఆ కాలమున వరదప్పగారికి యుండెను. పేదవార్లను దయతోచూచి ధర్మముగ చికిత్సను చేయుచుండెను. ఇంటికి వచ్చినప్పుడు డబ్బిచ్చిన (Visiting fee) వారు పేదవారని తోచినచో ఆ డబ్బును వారికి మరలయిచ్చి రోగికి పాలకు, గంజికి ఖర్చు పెట్టమనేవారు. విద్యార్థులకు సహాయము చేయుచుండువారు. దాత; దయాపరుడు. వారు స్థాపించిన అనాథశరణాలయము యిప్పుడు తిరువత్తియూరు హైరోడ్డులోయున్నది. వీరివైద్యశాల ఆల్ బట్ & కంపెనీ (Allbut & Co.) మొదట బ్రాడ్‌వేలోయుండెను. ఇప్పుడది మౌంటురోడ్డులో యున్నది,

## డాక్టరు హేలరు

ఆ కాలమున హేలరు డాక్టరుగూడ ముఖ్యముగ కోమట్లలో చాల పరిచయము పలుకుబడి గలిగి యుండెడివారు. వారు ఆంగ్లోయిండియనులు. చాల పొట్టిగ సన్నగ యుండిరి. మంచిడాక్టరని పేరు. ఇంటికివచ్చిన రు 2 లు ఫీజు. 10 నిమిషములు రోగివద్ద యుండి చిట్టికథలను చెప్పి రోగిని నవ్వించును. అతనికి యొక పాత బ్రూహాంబండి, ముసలి గుఱ్ఱము ఉండెడివి. ఆ బండి, మనిషినడకకంటె అధిక వేగముగ పోజాలదు. ఆబండిలో కూర్చుని వారు యెప్పుడును యేదో వ్రాసుకొనుచుండువారు. మద్రాసులో సోడాతయారు చేసి విక్రయించినవారిలో వీరే మొదటివారు. హేలరుసోడా యనిన, ఇప్పటి స్పెన్సరు సోడావలె పేరుపొందినది.

## అగ్రహారములు

చెన్నపట్టణము అన్ని జాతులకు కూడాలి స్థళమైనను బ్రాహ్మణులకు ప్రత్యేకముగ అగ్రహారములున్నవి. కొల్లావారి అగ్రహారం, క్రిష్ణప్పనాయుని అగ్రహారం, ఏకామ్రేశ్వర అగ్రహారం, రావిచెట్టు అగ్రహారం మొదలగునవి యును, మరికొన్నియును గలవు. ఇప్పుడా అగ్రహారములలో బ్రాహ్మణులు తక్కువ ; బ్రాహ్మణేతరులు అధికముగ నివసించుచున్నారు.

## Tauker & Sons (టాకర్ అండ్ సన్స్)

ఆ కాలమున ఏకామ్రేశ్వర అగ్రహారములో ప్రసిద్ధపురుషుడగు రంగ నాథ్ టాకరుగారు గొప్ప నగలవ్యాపారమును చేయుచుండిరి. వీరు గుజరాతి బ్రాహ్మణులు. మొదట తనయింటిలోనే యీ వ్యాపారమును ప్రారంభించి కొడుకులు పెద్దవారై ప్రయోజకులు కాగానే మౌంటురోడ్డులో T. R. Tauker & Sons అను పేరుతో గొప్పభవనమును నిర్మించిరి. అక్కడ బంగారు, వెండి, సామానులను నవరత్నములలో పొదుగబడిన వివిధ ఆభరణాదులను తయారుచేసి మంచి వ్యాపారమును చేయుచుండిరి. వీరికి ముఖ్య కాతాదారులు రాజులు, మహారాజులు, జమీందారులు, లక్షాధికార్లు. ఈ కాతాదార్లు మద్రాసుకు వచ్చినప్పుడు నివసించుటకు వీరు టాకరు గార్డన్ యను గొప్ప బంగళాను నిర్మించిరి. మద్రాసుకు వచ్చినరాజులు ఆ భవనమున కొంత కాలము బస చేసి పోవుసమయములో టాకరుకంపెనీవారు వార్లకు అమూల్య ములగు కొన్ని ఆభరణములను విక్రయించెదరు. ఆభరణములకు వెల

కంపెనీవారు నిర్ణయించినదే. ఈ ప్రకారము వారు కొన్ని సంవత్సరములు కోట్లకొలది వ్యాపారమును చేసి కడపట కంపెనీని మూయవలసివచ్చినది. ఈ టాకరుగార్డను రెండున్నరలక్షలకు వేలములో విక్రయమైనది.

## మోసస్ కంపెనీ (Moses Co)

ఈ కంపెనీ మౌంటురోడ్డులో యుండెను. వీరు రాజులకు మహారాజుల కును కావలసిన స్టేటు డ్రస్సులను (State Dresses) వెలగల యితర వుడుపులను కుట్టించి వారికి సప్లై చేయుచుండెడివారు. ఈ కంపెనీకి స్వంత దార్లు వైశ్యులలో పేరుపొందిన మోసస్ కంపెనీ శీతారామశెట్టిగారు. ఈ కంపెనీవారు రాజులకు ఉడుపులనుకుట్టి లక్షలాదులు సంపాదించిరి. టాకరు కంపెనీవారు ఆభరణములను, మోసస్ కంపెనీవారు ఉడుపులను రాజులకు సప్లైచేసి పేరుప్రతిష్టలు గడించిరి. కొంతకాలమునకు పిమ్మట వీరును షాపు తలుపులను మూసిరి.

## ధర్మసంస్థలు

ముందుకాలమున మద్రాసులోయుండు వైశ్యులు నాయుళ్లు మొదలియార్లు బ్రాహ్మణభక్తిని కలిగియుండిరి. వీరియిండ్లలో జరుగు వివాహాది శుభకార్యము లకు అశుభకార్యములకు బ్రాహ్మణులకు లడ్డుపేణీలతోకూడ భోజనమును పెట్టుచు - భూరిసంభావనలను యిచ్చుచుండిరి. ఆకాలమున అనేక అన్నసత్రము లలో బ్రాహ్మణులకు అన్నమును పెట్టుచుండిరి. దినమునకు సుమారు వెయ్యి మంది బ్రాహ్మణులు భుజించుటకు తగిన వసతిగల ధర్మసత్రములుండెను. మొదట నేను ఈవూరికి వచ్చినప్పుడు ఈసత్రములలోనే భుజించుచుంటిని.

## తంజావూరు రామానాయుని ధర్మసత్రము - అగ్రహారము

తిరువత్తియూరు హైరోడ్డులో తంజావూరు రామానాయుని సత్రమును, దాని నంటి అగ్రహారమున్నూ గలవు. ఈ రామానాయుడు చాల బ్రాహ్మణ భక్తిపరుడు, దైవభీతి కలవాడు. ఇచ్చట తండియార్పేటలోనే గాక తిరువళ్లూరు, కాంచీనగరము అందును ధర్మసత్రములను వేసియున్నాడు.

రామానాయుని కుమారుడు రంగయ్యనాయుడుగారు 1822 సం॥ డిశంబరు 7-వ తేదికి సరియైన చిత్రభాను సం॥రము కార్తీక బహుళ నవమి నాడు తెలుగులో వ్రాసియుంచిన వీలునామా చూడగా వారి దానధర్మములను,

రంగయ్యనాయుడుగారి బ్రాహ్మణభక్తి, దైవభీతి, శీలసంపత్తి మున్నగునవి యున్నా స్పష్టమగుచున్నవి. తండియార్పేటలోని సత్రమున ఆ రోజులలో 160 మంది పరదేశీలను, విద్యార్థులను, 60 మంది నౌకర్లను మూడుపూటల ఇష్టమృష్టాన్న భోజనమున తృప్తుల గావించుటకేర్పాటు చేయబడి యుండెను. ఇచ్చట విద్యార్థులకు భోజనము పెట్టి, పండితులచే వేదశాస్త్రములను చెప్పించే వారు. తిరువళ్లూరు, కాంచీనగరములందలి ధర్మసత్రములందు 12 సి మంది బ్రాహ్మణబాలురు భోజనవసతిగల్గి వేదాధ్యయన మొనర్చుచు, ధర్మశాస్త్రము లను పఠించుచుండిరి. ఆ వీలునామాయందంతటను శ్రీరామనామస్మరణ విరివిగా చేయబడినది. "పవిత్రమైన శ్రీరామనామ మహాత్మ్యమువల్లనే మన వంశాభి వృద్ధి. మన పూర్వులచే స్థాపింపబడిన ధర్మాభివృద్ధి సాగుచున్నవి. ఆ రాముడే మీకు భవిష్యత్తునందు సంరక్షకుడు. నిరంతరము రామనామము జపమొనర్చుటకై ఇద్దరు బ్రాహ్మణులను మనయింట ఏర్పాటు చేసియున్న సంగతి మీకు తెలియును. మీరును అట్లే నిరంతరము శ్రీరామనామజపము గావించు బ్రాహ్మణులను ఏర్పాటు చేయవలసినది" అని ఆ వీలునందు వ్రాసి యున్నారు. ఈ సత్రము పరిపాలన విషయమై కోర్టువారును ఒకటి రెండు సార్లు జోక్యము కల్పించుకొని స్కీములు నిర్మించియున్నారు.

## ఇతర సత్రములు

ఇట్టివే, అన్నసత్రములు మరికొన్ని మద్రాసు చుట్టుప్రక్కలనున్నవి. తిరువత్తియూరునందు, తిరువళ్లూరునందు యాత్రికుల వసతికొరకు ఎన్నైనా సత్రములున్నవి.

పూర్వము చెన్నపట్నం సమీపమున కొండూరు అని ఒక చిన్న స్టేషన్ ఉండెడిది. ఆ ఊరినే ఇప్పుడు విల్లివాకము స్టేషనుగ మార్చినారు. ఈ కొండూరునందు విశాలమైన ధర్మసత్రములున్నవి. ఇక్కడొక బావినీరు చాల ప్రశస్తమైనదని ప్రతీతి. అందుచే మద్రాసునుండి అనేకులు అచ్చటకిపోయి వివాహాది శుభకార్యములు చేసుకొనుచుండిరి. ఇప్పుడు మద్రాసులో పనులు గలవారు, ఇండ్లను నిర్మించుకొని ఆరోగ్యమునకై, అక్కడ నివసించుచున్నారు.

## బ్రహ్మతీర్థం - దుడువారిగుంట

మద్రాసులోనుండు జనులు చాలవరకు బాడుగయిండ్లలోనే నివసించు వారగుట వలన, యెవరైనను ఆయింటిలో చనిపోయి కర్మాంతరములను



# రాజా - లక్ష్మి అవార్డు

## డా॥ బెజవాడ గోపాలరెడ్డి

నెహ్రూ శతజయంతి సందర్భంగా ఈ సంవత్సరం రాజా - ల అవార్డు ప్రముఖ జాతీయ నాయకులు. కాంగ్రెస్ పెద్దలు అయిన డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారికి ఇస్తున్నారు. స్వాతంత్ర్య పోరాటంలో ఆయనకు ఆరు సార్లు జైలుశిక్ష పడింది. నాలుగు సంవత్సరాలు కారాగారవాసం గడిపారు. 1937 నాటి రాజాజీ మంత్రివర్గంలో తన 29 వ ఏట స్థానిక పరిపాలనా శాఖా మాత్యులయారు. 1955 లో ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి; '58 లో కేంద్ర మంత్రిత్వం; 67 నుంచి 62 నెలలపాటు ఉత్తరప్రదేశ్ గవర్నర్ పదవి. ఆతర్వాత నెల్లూరులో స్థిరపడ్డారు; మద్రాసు పదిహేను రోజుల కొకసారి వస్తుంటారు. రవీంద్రుని శాంతినికేతన ప్రభావమే ఆయన సాహిత్య పిపాస. ఆయన కవితా ధార నుంచి వెలువడ్డ 'ఆ మె', ఒక విశ్వ మోహిని, ఒక విద్యున్మాలిక. (మద్రాసులో నవంబరు 19 వ తేదీన ఆయనకు, రాజా - లక్ష్మి ఫౌండేషన్ మేనేజింగ్ ట్రస్టీ పివి రమణయ్య రాజా రు 25,000/- నగదు, ఒక ప్రశంసా పత్రమూ సమర్పిస్తారు. డాక్టర్స్ కెవిరావు జ్యోతీరావు దంపతులు అమెరికా పర్యటన ఏర్పాటు చేస్తారు.)

## సాహిత్య పురస్కారం

బహు భాషా వేత్త, బహుళ గ్రంధకర్త, సాహిత్య పరిశోధకులు, ప్రముఖ పత్రికా రచయిత అయిన తిరుమల రామచంద్ర తెలుగు పాఠక లోకానికి చిరపరిచితులు. ఆంధ్ర ప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయంవారు ఆయనకు గౌరవ డాక్టరేట్ ఇచ్చారు. (అదే ఉత్సవ సందర్భంగా రు 10,000/- నగదు, ప్రశంసా పత్రమూ సమర్పిస్తారు రాజా - లక్ష్మిఫౌండేషన్).

జరిపించుటకు యితర కాపురస్తులు ఒప్పుకొనేవారుకారు. ఈకారణమువలన మద్రాసులోనివారు బాల యిబ్బంది పడుచుండిరి. ఈ కార్యములను చేయుటకు ధర్మసత్రములను యిచ్చెడివారుకారు. ఇట్టి కష్టములను ముఖ్యముగ బ్రాహ్మణులే అనుభవించుచుండిరి.

ఈ కష్టములను చూచి యొక బ్రాహ్మణోత్తముడు రాయపురములో ఒక చిన్న తోటను అందు ఒక యిల్లును ఇచ్చి ఈకార్యములను అక్కడచేయుటకు తగుయేర్పాటులను చేసి పుణ్యమును కట్టుకొనెను. ఈ బ్రహ్మతీర్థమునందు బ్రాహ్మణులు మాత్రమే అపరక్రియలను జరుపుకొనవచ్చును. ఈచిన్నప్రదేశము ఇప్పుడు బ్రహ్మాండమైన బ్రహ్మసత్రముగ మారినది. ప్రతిదినము ఈ బ్రహ్మసత్రమునందు పది పన్నెండుకర్మలు జరుగుచున్నవి. వీరందరికి ఇక్కడ తగు వసతులు యేర్పాట్లు గలవు. అందరికి కావలసిన పాత్రసామానులుకూడా యిక్కడ యిచ్చెదరు. కొందరు ధనికుల కర్మలను ఇక్కడ జరిపించినపిమ్మట చనిపోయిన వారిపేరట ఒక చిన్న యింటిని ఈతోటలో కట్టించి యిచ్చెదరు. ఈప్రకారము ఈతోటలో వసతులు పెరిగిపోవుచున్నవి.

పల్లెటూళ్లలో చనిపోయినవారి కర్మచేయించుటకు, బ్రాహ్మణార్థములకు ముత్తైదువులు మొదలగు వార్లకు బాల కష్టపడవలయును. ఈ బ్రహ్మతీర్థమునందు అలాటి కష్టములు పడవలసిన పనిలేదు. పురోహితులు, బ్రాహ్మణార్థపు బ్రాహ్మణులు, ముతయిదువులు, దానములను పట్టువారు వీరందరూకూడా అక్కడ హాజరుగనుందురు. పది కర్మాంతరములకు సరిపోవువారందరు ఇక్కడ సులభముగ లభించెదరు. కర్మచేయు యజమాని స్నానముచేయుటకు ఇక్కడ గుంట గలదు. పురోహితునకు కావలసిన దర్భ ఈతోటలోనే పెంచుదురు. సమిథలపుల్లలు దొరుకు వృక్షములన్నియు ఈతోటలోనే యున్నవి. శిలాప్రతిష్టకు మంచిరాళ్లు యిక్కడనే దొరుకును. కర్మనంతయు కంట్రాక్టుకు తీసుకొని జరిపించే పురోహితులుకూడా ఇక్కడవున్నారు. నిత్యకర్మ చేయునప్పుడు పిండమును తినుటకు చనిపోయినవారిని స్మరించి కాకులను పిలువనవసరములేదు. ఇక్కడనే చెట్లమీద వేలువేలు పెంపుడు కాకులున్నవి. ప్రతిదినము పిండములను తినుచు చెట్లమీదనే కాపురముచేయు ఈ కాకులు బలిసియుండును.

మద్రాసులో, భర్తచనిపోయిన స్త్రీని కాపురముండు యింటికిరానివ్వరు. గనుక ఈ స్త్రీలకు బ్రహ్మతీర్థమునగల ఇండ్లు బాల వసతిగను మహోపకారముగను నున్నవి.

ఈలాటి ధర్మములనుచేసిన పుణ్యపురుషులే నిజముగ సంఘసేవకులు. ఈసందర్భమున నేనొక చిన్న విషయమును వ్రాసెదను.

బరంపురం కాపురస్తులగు మారెళ్ల గంగరాజుగారు మద్రాసుకువచ్చి డాక్టరు రంగాచారి నర్సింగుహోములోచేరి వ్రణచికిత్సను పొందుచుండిరి. వారివ్రణమును ఆపరేషన్ చేసినపిమ్మట ఆ నర్సింగుహోములోనే వారు చనిపోయిరి. వారిభార్య, కొడుకు వగైరాలు వారితోకూడనే మద్రాసునందుండిరి. వారి బంధువులుకూడ మద్రాసులో కొందరుండిరి. గంగరాజుగారు నాకు స్నేహితులగుటవలన నేనుకూడ ఆ సమయమున వారితోకూడ ఉంటిని. వారు ఈ వూరికి క్రొత్తఅగుటవలన దహనసంచయనాది కార్యములకు నేను సహాయపడి ముగింపించితిని.

వారిభార్య అప్పుడు వైద్యశాలను విడిచిపెట్టవలసివచ్చినది. ఆమె ఉండుటకు మద్రాసులో స్థళము దొరకదాయెను. ఆమె దగ్గరబంధువులుకూడ ఆమెను వారిండ్లకు తీసుకొని పోరైరి. అప్పుడామెను నాయింటికి తీసుకొనిపోయి ఆదరించితిని. వారిబంధువులు ఇతరులుకూడ ఆమెను నాయింటికి తీసుకపోకూడదని నాకు బోధించిరి గాని నేను వినలేదు. నేను నాయింటికి తీసుకరాకుండిన ఆమెగతి యేమి కావలయునో? మన సంఘములోనున్న ఇటువంటి దురాచారములను అడుగంటునట్లు చేయుటయే సంఘసేవ.

ఆమెను నా యింటికి తీసుకొనిపోయిన నా యింటిలో కీడు సంభవించునని బోధించినవారు ఇప్పుడు లేరుగాని నేనున్నాను; ఆతల్లికూడ బిడ్డలతో సుఖముగ బరంపురంలో యున్నది. ఈమె కాకినాడ కాపురస్థులగు గతించిన పోతాప్రగడ బ్రహ్మానందరావుగారి పెద్దకుమార్తె.

# 11. మా ఊరు

## మద్రాసు ప్రయాణము

నేను చిన్నతనమున మద్రాసుకు వచ్చినపిదప అప్పుడప్పుడు మావూరగు ఇనమన మెళ్లూరికి పోవుచుంటిని. రైలుసౌకర్యము లేనప్పుడు ఉప్పుకాలువ (Buckingham Canal)లో పడవలమీద ప్రయాణమును చేయుచుంటిని. ఆ కాలమున మద్రాసులో బోటుయెక్కిన కొత్తపట్నం రేవుకు 10, 12 దినములలో చేరుచుంటిమి. బోటుచార్జి మనిషికి ఒకరూపాయి మాత్రమే. అయితే ఈప్రయాణమునకు కావలసిన భోజనపదార్థములను, చిరుతిండ్లను సమృద్ధిగ తీసుకొనిపోవలయును. వంగవోలు ప్రాంతములనుండి వచ్చినవారు కొందరము చేరి యీ పడవ ప్రయాణమును చేయుచుంటిమి. ఇందు స్త్రీలు, పురుషులు, బిడ్డలు యుందురు; పడవ నడుపు సరంగులుందురు. దక్షిణపుగాలియుండిన, పడవకు చాపనెత్తిన, పడవ వేగముగ పోవును. ఈ చాపను ముతకగుడ్డతో

తయారుచేయుదురు. గాలిలేనప్పుడు పడవ సరంగులు గడలను వేయుచు పద ములను పాటలను పాడుచు పడవను నడిపించెదరు. గడలనువేసి అలసినప్పుడు బోటుకు మోకునుగట్టి లాగుకొనిపోయెదరు. కొన్నిసమయములందు ప్రయాణీకులుగూడ పడవదిగి సరంగుతోకూడ పడవమోకును లాగుచుండెదరు. ఉప్పుగాలి సోకుటవలన ఆకలి అమితముగనుండును. నీళ్లవసతి గల బోటు చూచి వంటచేసుకొనుటకు పడవను నిలిపెదరు. మేము పడవను దిగి సమీప మునయుండు మంచినీళ్ల బావివద్దకుపోయి స్నానముచేసి చెట్టుబాటుననో, గుట్టబాటుననో పొయ్యిబెట్టి పుల్లలను యేరుకొనివచ్చి అన్నమునుమాత్రము వండుకొనువారము. గాలివలన మంట తప్పెలకు సరిగ తగలనందున కొన్ని సమయములలో అన్నము సరిగ పక్వముగాక నసుబాయ అగుచుండును. ఇంటి నుండి వచ్చునప్పుడు ప్రయాణీకులందరు కమ్మపొడి, మినుముల చింతపండు పచ్చడి, చింతకాయపచ్చడి వగైరాలనుకూడ తెచ్చుకొనెదరు. కుట్టుడాకులు కూడ యుండును. పచ్చళ్లు విసుగుపుట్టినప్పుడు పచ్చిపులుసును చేసుకొనెదము. అకాలమున నెయ్యి చౌక గనుక సమృద్ధిగ నెయ్యిని తెచ్చుకొనుచుంటిమి. సమీపమున పల్లెలుండిన మజ్జిగ దొరుకును. అందరము భోజనముచేసి మిగిలిన అన్నమును రాత్రికి మూటగట్టుకొని, తప్పెలను తోమి దానినిండుగ మంచినీటినితీసుకొని పడవచేరుదుము. పడవలోకూర్చుని కూరుకును పట్టిం చెదము. పడవసాగును. చల్లబడిన పిమ్మట అందరము పడవ పై భాగమున చేరుదుము. పైన గాలి చక్కగ వీచునప్పుడు ఆనందముతో పాటలు పద్యములను పాడుచుందురు. మాతోకూడ ఒక లాందరయుండును. రాత్రి కాగానే అన్నముమూటనువిప్పి ఒకభాగ్యశాలి అన్నిపచ్చళ్లను యొకటిగ కలిపి కదంబముచేసి పెద్దఅన్నపువాయను కలిపి చుట్టుకూర్చున్న వారిచేతులలో ముద్దలుపెట్టును. పిడచ లగుట వలన పలుమారు నీరుత్రాగవలసివచ్చును. వెన్నెలరాత్రి అయిన మరల పడవపైకిపోయి నిద్రవచ్చువరకు కబుర్లు కథలు చెప్పుకొనుచుండి పిమ్మటదిగి నిద్రించెదము. ఈ ప్రకారము పడవప్రయాణము ఆ దినములలో చేయుచుంటిమి. ఈ పడవ ప్రయాణములలో కలిగిన ఆనందమును, ఆకలిని, భోజనము రుచిని యిప్పుడు తలుచుకున్న నేను అప్పటివాడనేనా యని సందేహము కలుగుచున్నది.

కొత్తపట్నం రేవులో పడవదిగి వంగోలుకుపోయి అక్కడ మాపెత్తండ్రి యింట్లో బసచేసి మరునాడు మావూరికి వెళ్లినప్పుడు ఒంగోలునుండి వేడివేడి శనగపప్పును, ముంత ఖర్జూరపుపండును తీసుకొనిపోవుచుందును. నా అత్త గారికి మద్రాసు మిఠాయిదినుసులు సరిపడవు. మావూరికి నేను పోవునప్పుడు గజ్జలగుళ్లపు జట్కాబండిమీద పోవుచుందును. నాబండి వూరికి సమీపించ



"Dad, who is this Sage Agastya? So much is being said about him. Historically we know he was the one who crossed the Vindhyas to spread the Aryan Culture," said Raghu.

"That is the historical aspect but mythologically he stands on a different footing," observed Raghu's Father.

"Rama went to his Ashram, fell on his feet and took his blessings - that I know."

"At that time Sage Agastya could perceive the course of coming events - the separation of Rama and Seeta and the inevitable war that would follow. On the battle - front, a day before the slaining of Ravana, it was Agastya that asked Rama to offer prayers to the all - powerful Sun-God, symbolic of Time, and recite Aditya Hridayam with devotion. And Agastya stood as a rock of strength on the side of Rama, emphasising the higher plane of spiritual order to the brute force of Ravana's arrogant might. However great Rama might be, he could not have won the war without the blessings of Agastya who was a personification of the holy trinity, Brahma - Vishnu - Maheswara."

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



గనే తహసీలుదారుడు వచ్చుచున్నాడని గ్రామమునసబు, కరణము, ముదాం మొదలయినవారు నడుములకు గుడ్డలనుచుట్టి దండములనుపెట్టుచు బండిని సమీపించుచుండిరి. తీరా నన్ను గుర్తించి, ఈయన మహాదేవయ్య అల్లుడని, దిగాలపడి పోవుచుండిరి. ఇంటివద్ద బండి దిగగానే అత్తగారు ముందునామాట లను సవరించును. భోజనమువేళకాగానే దొడ్డిలోయుండు ఎండకాగునీళ్లతో స్నానమును చేయమని చెంబును కుండవద్ద పెట్టును. స్నానముచేయుటకు ప్రత్యేకముగ ఈ వూరిలో స్థలము యుండదు. కనుక గోడలులేనిదొడ్డియే స్నానముకు మరుగుస్థళము. నేను స్నానముచేయునప్పుడు యిరుగుపొరుగు వారు నావద్దకువచ్చి మద్రాసు సమాచారములను అడిగేవారు. అకాలమున సబ్బుతో వళ్లురుద్దుకొనుట వింత. ప్రతివారు దగ్గరకు వచ్చి సబ్బును వాసన చూచి పోయేవారు. ఈసారి వచ్చినపుడు తమకొక సబ్బుబిళ్ళను తెచ్చిపెట్ట మనేవారు. మద్రాసునుంచి నేనొక చిన్నఅత్తరుపెట్టెను తీసుకపోతిని. ఆ పెట్టెలో ఆరువిధములైన అత్తరుబుడ్లు అత్తరుబిళ్లలు యుండెడివి. మాకు పాలు, పెరుగు, కూరగాయలు, పచ్చిశెనగమండలు, సజ్జకంకులు వగైరాలు సప్లయిచేయుకాపువారు నా వద్దకువచ్చి అత్తరువును పూయించుకొని పోవువారు. వారందరు నన్ను 'నరసయ్య' యని పిలిచేవారు.

## చెదలవాడ తిరునాళ

ఈ చెదలవాడ మావూరి యేటి అవల వడ్డునేయుండును. చైత్రమాస ములో శ్రీరామనవమికి శ్రీరాముల ఉత్సవము చెదలవాడలో జరుగును. ఈప్రాంతములకంత ఈ ఉత్సవము ప్రసిద్ధమగుటచే పొరుగూరినుంచి వేలకొలది జనులు సంబరమును చూచుటకు వచ్చెదరు. ఇక్కడ వరిగబియ్యముపిండితోను, బెల్లముతోను, తయారుచేసిన మిఠాయి, ఏలకపుండలు, రంగుమిఠాయి, వేడిగారెలు మొదలగునవి అమ్ము అంగళ్లుండును. దూదినిమ్మకాయలను అమ్ముదురు. నులకవుండలు, పట్టెమంచములు, ముల్లుకట్టలు, ఎద్దుల మెడపట్టెలు, నవారుబిళ్ళలు, పశువుల పలుపులు, మోటతోలు మోకులు మొదలగువాటినికూడ యీ తిరునాళ్లలో అమ్ముచుండిరి. ఇదియొక విధముగ గృహపరిశ్రమల ప్రదర్శనము అనవచ్చును. ఇక్కడ అమ్ముచుండిన మల్లెపూలదండల వాసనను యిప్పటికిని నేను మరువలేదు. ఇది వేశ్యలుండు స్థళము గనుక చాలదూరమునుండి పెద్దమనుష్యులు వచ్చుచుండిరి. స్వామి రథోత్సవమునాడు బ్రాహ్మణ సంతర్పణ జరుగును. ఆ సంతర్పణకు యిప్పుడుకూడ నేను కొంత ద్రవ్యసహాయమును చేయుచున్నాను.

# మా వూరి దేవాలయములు

మావూరిలో శివాలయము, విష్ణ్వాలయము రెండు దేవాలయములున్నవి. శివాలయము గర్భగుడిగోపురముపైన బండబూతువిత్రములు సొగసుగ చెక్కబడి యున్నవి. ఈ చిత్రములను చూచుటకు పెద్దలు చిన్నలుకూడ చేరి చూచి సంతోషించుచుందురు. ఈ దేవాలయపు అర్చకుడు తంబళాయన. వైద్యమును చేయును. విష్ణ్వాలయపు అర్చకుడు నంబిఆయన. ఈ నంబి అర్చకుడు గూడ వైద్యుడే. ఈవూరిలో యీ అర్చకులిరువురు వైద్యమును చేయుచుండెడి వారు. సాధారణముగ పల్లెటూర్లలో నంబి తంబళులే గ్రామవైద్యులు. ఈ విష్ణ్వాలయ ముఖద్వారమునకు పెద్దతలుపులను నేను చేయించియిచ్చితిని. ఈ దేవుళ్ల పార్వేటకు (శమీపూజకు) వెళ్లునప్పుడు స్వాముల వెంట వూరి రంగి రీజులు, వార్లయిండ్లలో పురాతనముగ యుండు కత్తులు, బాకులు, ఈటెలు మొదలగు పురాతనపు యుద్ధసాధనములతో వెంట వచ్చెదరు. ఈపాత అయుధములు వీరికి యెట్లు లభించినవో? విజయదశమినాడు ఆయుధములకు మెరుగుబెట్టి పూజించి నమస్కరించెదరు. ఈ వూరి ప్రక్కనున్న కమ్మయేరు. వూరిని క్రమముగ మ్రింగుచున్నది. దేవాలయములనుకూడ కబళించుటకు గుండ్లఏరు సమీపించుచున్నది.

# కోటప్ప కొండప్రభలు

కోటప్పకొండయను శివక్షేత్రమొకటి గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలోనున్నది. మ్రొక్కుబళ్లకు తిరుపతికొండవంటిదే కోటప్పకొండ యున్నూ. ప్రతి శివరాత్రినాడు ఆ కొండకు వేలకొలదిజనులువచ్చి శివుని దర్శించి పూజించిపోయెదరు. వారి వారి మ్రొక్కుబళ్లను కోటయ్యకు చెల్లించెదరు. ఈక్షేత్రము ఆంధ్రదేశమున పెద్దపేరు గాంచినది. గుంటూరుజిల్లాలో మెట్టతాలూకాలందలి రైతులు వ్యవసాయమునకు ముఖ్యమైన ఎడ్లను బిడ్డవలెనే పెంచెదరు. గృహయజమాని జొన్నన్నమును ముద్దలుచేసి మ్రింగునపుడు, చనువుకొలది కోడెదూడ లతనివద్దకువచ్చి, అతడు కంచమునుండి ఎత్తి నోటి కందించు ముద్దలను తిని పోవుచుండును. అట్టి ఎడ్లకు, బిడ్డలకు జబ్బుచేసి నపుడా రైతులు కోటయ్యకు ప్రభలు కట్టుకొని కొండకు నడిచెదమని మ్రొక్కుకొందురు. ఈ మ్రొక్కుబళ్లను చెల్లించుటకు అనేక గ్రామములనుండి రెండెద్దుల బండ్లమీద ప్రభలను గట్టి వాటిని చిత్రవిచిత్రములగు రంగుగుడ్డలతో శృంగారించెదరు. ప్రభయనగా వెదురు బొంగులతో రెండెడ్లబండ్ల గానులమధ్య అమరుటకు తగినవెడల్పుతో సుమారు 10 అడుగుల పొడవున చట్టముగా కట్టు

దురు. మధ్యమధ్య చీల్చిన అడ్డబద్దలువేసి బిగింతురు. పై అంచున త్రికోణా కారముగా నమర్చెదరు. ఆ చట్టమునకు గుడ్డలను కట్టురురు. దానిపై రంగుగుడ్డలను తోరణములను చిత్రములను అలంకరింతురు. చిరుగంటలు కూడా కట్టుదురు. ప్రభలకేగాక వానిని లాగుటకై ఏర్పరిచిన ఎద్దులకుకూడా అప్యాయముగ గంటలను, గజ్జలను, మువ్వలను అద్దాలశిగ మోరలనుకట్టి అలంకరింతురు. ఈబండ్లలకు కట్టే ఎద్దులను ప్రత్యేకశ్రద్ధతో అన్నిటికన్నా హెచ్చుగా పోషింతురు. వీటికి పచ్చిజొన్నబొప్ప, ఉలవలు, పత్తిత్తులురుబ్బిన పిండి పెట్టిపెంచెదరు, ఈ తిండి తిని ఆ వృషభరాజములు తెల్లగ తయా రగును. వాటిచర్మము తెల్లటి వెలువెట్టుపట్టుబోలు మిసమిస మెరయుచుండును. మెడలకు గట్టిన గజ్జెలపట్టెళ్లు, మొగమునకు తగిల్చిన కుచ్చులశిగమోరలు, కాటుకకండ్లు, కురచక్రొమ్ములు, మెడమీద పెద్దబెండువంటి గట్టిమూపురములు, మెడమీదుగా రొమ్ముచుట్టిరా బిగింపబడిన తోలుపటకాలు, ఇన్నింటితో గాంభీర్య ముట్టిపడ నడచివచ్చు ఆ ఎద్దులను చూచినప్పుడు, పెండ్లికొడుకులు పెండ్లికి తరలిపోవుచునట్లు గాన్పించును. అవి నడచుచు, అప్పుడప్పుడు తల విసరు వయ్యారమును, గాంభీర్యమును, అలంకారమును కనులపండువుగ నుండును. అట్లే ఉత్సాహముకొలది అవి వేయు రంకెలను ఉత్తేజముగను ఉద్రేకకరముగను నుండుటయేగాక శంఖారవమువలె శ్రావ్యముగను ఉండును. సంగీతశాస్త్రము నందు ఈ రంకెనే సప్తస్వరములలో రెండవదియగు "రి" (ఋషభం) అని నిర్ణయించిరి. ఈ స్వరముచే వీరరసము, అద్భుతరసము, రౌద్రరసము వెల్లంయగునని చెప్పబడినది. శార్గధరుని సుభాషితములలో ఇట్లు నిర్వచింప బడినది. "షడ్జర్షభౌ తథాజ్ఞేయౌ వీర రౌద్రాద్భుతే రసే ౧౭॥" కావుననే ఈ బండ్లకు బాగుగా బలిసిన కోడెలను గాని కోడెప్రాయపు ఎడ్లనుగాని కట్టెదరు. ఈ బండిమీద కూర్చుని తోలే రైతులును మంచి వయసు కుర్రవాండ్రుగ నుందురు. మంచి దృఢకాయము కలిగి కందుకూరి తలగుడలను చెమ్లా పాగాలుగా తలలకుచుట్టి, రంగు రుమాళ్లను నడుములకు బిగించి కట్టి, ముల్లు కర్రలతో ముందు నొగలలో కూర్చుందురు. మొలకు బిళ్లత్రాడు, కాళ్లకు ఎర్రబణాతు గురిగింజలు అమర్చిన కిర్రుచెప్పులు, చేతులకు వెండి మురుగులు, సందిట దండకడియములు, చెవుకు జంపు, ఇత్యాదులతో సింగారించుకొని, కోరమీసములతో, కొంటెచూపులతో, కండ్లమీదుగా కణతలు కలియదిద్ది తీర్చిన విభూతి రేఖలతో కనుబొమలమధ్య నుంచిన కుంకుమబొట్టుతో, నోట నున్న గుంటూరు మెట్ట (సాటి) పొగాకు (బారెడు) చుట్టను త్రాగుచున్నట్లుగానే ప్ప-ప్ప-ప్ప-ప్పప్పా అని ఎద్దుల నదలించుకొనుచు వారు బహు చలాకీగా సారథ్యమును సాగింతురు. ఆ మాత్రము అదలింపైన సహింపనట్లుగా ఆ కోడెలు రోషావేశమున పరవళ్ల త్రొక్కుచు విసురుగా ముందుకు సాగిపోవు

చుండును. అట్టి వానిలో బాగుగా పొగరుబోతులైన కోడెలకాళ్లకు గిట్టలపైన త్రాళ్లకట్టి ఇరువంకల చేతబట్టుకొని, అదలించి వాని దుడుకును నిగ్రహించుచు ప్రాయము వ్రాలుచున్న పెద్ద రైతులు నడుస్తూంటారు. ఈ బండ్లు మా ఊరి గుండా పోవునప్పుడు వూరిలోనివారు ఈ ప్రభలకెదురేగి నిల్పి సత్కరించు చుండిరి. స్త్రీలు బుంగలకొలది నీరు తెచ్చి వారుపోయుటయు, పురుషులు కత్తి పట్టుకొని దండకములు, ఖడ్గములు - అను తెనుగురచనములను ఆవేశముతో 'అద్దఅద్దశ్శరభ' యని ఊతముతో చదువుటయు నాకింకను జ్ఞాపకము. సామాన్యముగ నీ ఖడ్గములను, దండకములను చదువువారు జంగములు, బ్రాహ్మణులగు అరాధ్యులు. వీనికి కథపట్టు సామాన్యముగా దక్షయజ్ఞధ్వంస మను శివలీల లేక వీరభద్రుని వీరవిహారము, మచ్చునకొక్కచరణము :

## దక్షుని తలగొట్టి తగరు తలపెట్టి అద్దద్దద్ద శ్శరభ - శ్శరభ

ఈ పాడేవారు ఒక కత్తిని చేతపట్టుకొందురు. లయతప్పక ముందు వెనుకలకు నడుచుచు, గంతులువేయుచు, పరవళ్లత్రొక్కుచు పాడుదురు. ప్రక్కన నొకడు చల్లగా రుంజ వాయించుచుండును. మరొకవంక నొకడు - సామాన్యముగా నితడు ఎడమవైపు నుండును. డోలునో, కనకతప్పెటనో వాయించుచుండును. అంతంతల నిలిచినవారు కొమ్ములు, కాహళములు అదును చూచి ఊదుచుందురు. సమీపస్థుడై మరొక్కడు రస ముట్టి పడుపట్టున శంఖమొత్తును. ఇట్టిసన్నాహమధ్యమున - ఆ వీరుడు, ఖడ్గమునందలియొకటి రెండు చరణములు చదివి - ఉసితో ఆ డోలునాయించు వానివద్దకు (లేక కనక తప్పెట వానివద్దకు) ఉరికి - ఆ వాద్యవిశేషమును అంటునట్లుగా తన తలను చెవియోరన అనించి, చెవిగట్టిగా మూసుకొని - 'అద్దద్దద్దద్దశ్శరభ - శ్శరభ' అని ఉచ్చస్వరమున పల్కును. ఆ పలుకునకు అనుగుణముగా అతడా వాయిద్యమును గట్టిగా వాయించును. అసలా 'శరభ' శబ్దము వాని నాభి కమలమునుండి భేదించుకొని మారు మ్రోగుచు వెలికి వచ్చును. అది వినుటకు మహాభయంకరముగను, రౌద్రముగను, భక్తులకు భద్రమొసగునట్టిది గను యుండును, కొందరు వీరశైవులీ ప్రభలకెదుట వారసములు గ్రుచ్చు కొనుట, గండకత్తెరలు వేసుకొనుట అను అఘాయిత్యములను కూడా చేయుదురట.

ఈ కోటప్పకొండ తిరునాళ్ల ఏటేటా జరుగు జాతీయమహోత్సవము. ఈ తిరునాళ్లలో రైతులకు కావలసిన పనిముట్లను ప్రదర్శించి విక్రయించెదరు.

(ఇంకా వుంది)



## 1989 ఆగస్టు 09

సుప్రసిద్ధ ఫిలిమ్ నిర్మాత యల్వి ప్రసాద్ మనుమడు చి॥ సాయి ప్రసాద్‌కు (రమేష్ కుమారుడు), సౌ॥ కవితకు (వసంతకుమార్ దంపతుల కుమార్తె) ఈ ఉదయం తొమ్మిది న్నరకు విజయా శేషమహల్‌లో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. పొద్దుట ముహూర్తానికీ సాయింత్రం రిసెప్షన్‌కి బంధుమిత్రులనేకులు వచ్చి నూతన వధూవరులను ఆశీర్వదించారు.

## .....11

ప్రఖ్యాత ఫిలిమ్ దర్శకులు బాపయ్య కుమార్తె సౌ॥ పద్మకు, స్వర్గీయ ఆనందరావు కుమారుడు మనోహర్ ప్రసాద్‌కు (యల్వి ప్రసాద్ మనుమడు) సాయింత్రం 8గం॥ల 52 ని॥లకు విజయా శేషమహల్‌లో వివాహం జరిగింది. బొంబయి ఫిలిమ్ పరిశ్రమకు చెందిన ప్రముఖులనేకులు నవదంపతులను దీవించేందుకు ప్రత్యేకంగా వచ్చారు. ఏడున్నరకి డిన్నర్ - ఆ తర్వాత పెళ్లి వేడుక. శివస్వామి దంపతులు, మేమూ కలిసి వెళ్లటంచేత కావలసినన్ని కబుర్లు. కొచ్చిన్‌లో తను యటెండైన 'నిషేకము' గురించి చెప్పారు శివస్వామి. నేను పెద్ద మనిషిలా వూరుకున్నప్పటికీ, మాలతీ రాధారాణీ ఆయనని అల్లరి ప్రశ్నలతో వుక్కిరి బిక్కిరి చేశారు.

## .....14

"ఆతిథ్య మర్యాదకు ఈ దక్షిణాపథం ఆది నుంచీ పేరు పొందింది. మద్రాసులో యింత మంది ఫారెన్ స్టూడెంట్స్ ఉన్నారనీ నాకు తెలియదు. విశ్వవిద్యాలయ ప్రాంగణాలు దేశ దేశాల యువతీ యువకులు మధ్య సత్సంబంధాలు, సాంస్కృతిక అవగాహన కలిగించే మైత్రీ వేదికలు అవాలి. ఇది ఏక ప్రపంచం - వేర్వేరు స్వాతంత్ర్యజ్యోతులు అఖండ జ్యోతిగా వెలగడంలోనే విశ్వ మానవ కళ్యాణం ఉంది" - అన్నారు ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్ (Indian Council for Cultural Relations) స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా ఈ సాయింత్రం వుడ్‌లాండ్స్‌లో ఏర్పరిచిన సమావేశానికి విచ్చేసిన హెచ్ బి యన్ శెట్టి (తమిళ

నాడు విద్యాశాఖ కమీషనర్). "ఈ ఐ సి సి ఆర్ (ICCR) మూల విరాట్టులు నెహ్రూ, అజాద్‌లు - ఇది వారి శతజయంతి సంవత్సరం. ఆ మహనీయులు నాటిన మొక్క ఈనాడు ఫలాలనిస్తోంది" - అన్నారు స్వాగతం పలికిన వాసుదేవన్ (మద్రాసాఫీసు డైరక్టర్).... మాండలిన్ శ్రీనివాస్ తన పాట కచ్చేరీ పట్టం సుబ్రహ్మణ్యయ్యర్ వర్ణంతో ప్రారంభించి ముత్తుస్వామి దీక్షితార్, త్యాగ రాజస్వామి కృతులతో శ్రోతలను శ్రవణానంద వీధులలో పర్యటింపజేశారు. 'వాతాపి గణపితం భజే'తో మొదలెట్టి, 'ఎందరో మహానుభావులు అందరికీ వందనములు' అని తను తన్మయత్వం పొందుతూ, వింటున్నవారి చేత చంద్ర నౌకా విహారం చేయించారు.

## 18

అన్నపూర్ణా పిక్చర్స్ అధినేత దుక్కిపాటి మధుసూదనరావు మనుమడు చి॥ మధుసూదనరావుకి (డాక్టర్ స్వామి దంపతుల కుమారుడు) తణుకు ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్ మనుమరాలు సౌ॥ కమలకు (వెంకటరాయుడు దంపతుల కుమార్తె) ఈ ఉదయం విజయా శేష్‌మహల్‌లో వైభవంగా వివాహం జరిగింది. మధుసూదన రావు గారంటే మద్రాసు ఫిలిమ్ పరిశ్రమలోని యావన్మందికీ ఎంతో గౌరవం. నవ దంపతులకు మా శుభాకాంక్షలు.

## ..... 22

వుదరింగ్ హైయిట్స్, మిసెస్ మిని వర్, ది బెస్ట్ ఇయర్స్ ఆఫ్ అవర్ లైవ్స్, బెన్‌హర్ (Wuthering Heights, Mrs. Miniver, The Best Years of Over Lives, Benhur) వంటి చిత్రాలు తీసిన విలియమ్ వైలెర్‌కి (William Wyler) అమెరికన్ ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ సత్కారం జరిపించడం ఎ పి ఐ శెల్యూట్స్ (API Salutes) పేరిట, అమెరికన్ సెంటర్‌లో ప్రత్యేక ఆహ్వానితులకు చూపారు. బిగ్ కంట్రీ, రోమన్ హాలీడే, ఫన్నీ గర్ల్, ఫ్రెండ్లీ పెర్సుయేషన్ (Big Country, Roman Holiday, Funny Girl, Friendly Persuasion) వంటి చిత్రాలలోని దృశ్య చయనికతో గ్రిగరీ పెక్ ప్రయోక్తగా సత్కార కార్యక్రమం జరిగింది.... 1902లో జర్మనీలో జన్మించిన విలియమ్ వైలర్, 1920లో పారిస్‌లో సంగీతం (వయొలిన్) నేర్చుకుంటూ వుండగా, అమెరికా వెళ్లగల అవకాశం లభించగానే, ఎగిరి గంతేస్తాడు. మొదటి ఓడ ఎక్కి న్యూయార్క్ చేరుకొని, యూనివర్సల్ వారి ఆఫీసులో జర్మన్ ఫ్రెంచి భాషల అనువాదకునిగా, కాలు మోపుతాడు. ఆ తర్వాత 'యమ్ జి యమ్'తో పరిచయమవుతుంది. మళ్లీ యూనివర్సల్‌కే వచ్చి 23 ఏళ్లపాటు వారి దర్శకునిగా మూకీలలోను, టాకీలలోను పని చేస్తాడు. 1921 నాటి 'హౌస్ డివైడెడ్' (House Divided) అనే

సైలంట్ పిక్చర్, వైలర్ ప్రతిభను వెల్లడి చేస్తుంది. నిర్మాత శామ్యుల్ గోల్డ్‌విన్ ఉత్తమాభిరుచులు గల వ్యక్తి అవడం వల్ల, విలియమ్ వైలర్‌కి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇస్తాడు. ఇక 'టేకుల' విషయంలో కళాకారులు వైలర్‌ని కఠినాత్మునిగా పేర్కొం టారు. ఒక్కోసారి ముప్ఫయి ముప్ఫ య్యయిదు 'టేకులు' తీసేవాడట. ఈయన తీసిన 75లోను 42చిత్రాలను 'ఆర్కయివ్స్'లో భద్రపరిచారు. 1939 నాటి వుదరింగ్ హయిట్స్‌లో హంఫ్రీ బొగార్డ్, బెట్టీడేవిస్; 1953 నాటి రోమన్ హాలీడేలో గిగరీపెక్, కాథరిన్ హెబ్బర్న్. తొమ్మిది సార్లు ఉత్తమ దర్శకునిగా అవార్డుపొందాడు.

. . . . . 23

పూర్ణోదయావారు (నిర్మాత: ఏడిద నాగేశ్వరరావు), త్వరలో విడుదల కానున్న తమ 'స్వరకల్పన' చిత్రం లోని పాటలను బ్రేక్ ఫాస్ట్ పార్టీలో పాత్రికేయులకు వినిపించారు. మొత్తం ఆరు పాటలు. సిరి వెన్నెల సీతారామ శాస్త్రి 'ఛుకు ఛుకు ఛా ఛా' ని యస్పి పాడగా, జొన్న విత్తుల రాసిన 'వసం తం పల్లకి', 'సరిగమ పదని' లను యస్పి - శైలజ, యస్పి - జానకి పాడారు. వంశీ ఇళయరాజాల 'కేళీ విలోల వేణుగోపాల' కు యస్పి - శైలజలు గాత్ర మిచ్చారు. నాయని కృష్ణమూర్తి 'పలుకేమైనా' పాటకు కంఠం యస్ జానకి. ముళ్లపూడి శాస్త్రి రచన 'మేఘమాల కోసం' అనే గీతికను యస్పి - జానకి పాడారు. పూర్ణోదయా వారి చిత్రాలలోని పాటలకు సాహిత్య పుష్టి, సంగీత సౌరభం విధిగా ఉంటాయి. కర్ణ పేయమైన గాన స్రవంతి. అయితే, సినిమా పాట లెప్పుడు సన్నివేశాన్ని బట్టి ప్రాణం

పోసుకుంటాయి. ఈ చిత్రానికి దర్శకులు ; వంశీ ; మ్యూజిక్ : అమర్ ; కథానాయకుడు : శ్రీరామ్. 'స్వరకల్పన' లో యితివృత్తానికి అనుకూలమైన పాటలు వున్నాయన్నారు నిర్మాత ఏడిద నాగేశ్వర్రావు. కాసెట్లకు: లహరీ రికార్డింగ్ కంపెనీ, బెంగుళూరు 560009.... పిఆర్ఓ : అర్జునరావు.

. . . . . 28

'పరిశ్రమలను జాతీయం చేయడం ప్రజోపకరంగా ఉంటుందనీ, ఆ వొనగూడే లాభం జాతీయ సంపదను పెంచుతుందనీ ఒకప్పుడు అనుకున్న మాట నిజమే! అయితే, ఈ నేషనలైజేషన్‌లో రాజకీయవొత్తిడి ప్రవేశించగల అవకాశం ఉన్నదని అప్పట్లో ఆర్థికవేత్తలు అనుకోలేకపోయారు: ఏ పరిశ్రమ కా పరిశ్రమ స్వయం నిర్ణయాధికారంతో, జాతీయ శ్రేయస్సు వైపుగా పురోగమిస్తుందని భావించారు. కాని ఎంత ఆదర్శ ప్రాయమగు సిద్ధాంతమైనా, కార్యాచరణలో తప్ప తన లోటు పాట్లను బహిర్గతం గావించదు. బ్రిటన్‌లోని బొగ్గు పరిశ్రమ నేషనలైజేషన్‌లో నష్టపోయి, ప్రయివటైజేషన్‌లో లాభసాటిగా పరిణమించింది. ఇంగ్లండులోని మూడుకోట్ల జనాభాలో 65 లక్షల మంది వేర్వేరు కంపెనీల వాటాదార్లు; ఒకప్పుడు 15 లక్షలు మాత్రమే వున్న ఈ వాటాదార్ల సంఖ్య నాలుగున్నర రెట్లు పెరగడానికి మూల హేతువు ప్రయివటైజేషన్. ఈ పద్ధతి వల్ల ప్రభుత్వ యంత్రాంగం బలహీన మవదు సరిగదా మరింత పటిష్టవంత మవుతుంది. పన్నుల ఎగవేతను అవలీలగా అరికట్టవచ్చు; అవినీతి లంచగొండితనాలను అదుపులో పెట్టవచ్చు. ప్రయివటైజేషన్ పద్ధతిలో దక్షిణ కొరియా, సింగపూర్‌లు తమ ఆర్థిక సౌష్టవాన్ని పెంపొందించుకోగలిగాయి. జపాన్ కూడా ఈ మార్గమే అవలంబిస్తోంది. కాపిటలిజమ్‌ని జయించేందుకే నేషనలైజేషన్ (జాతీయం చేయటం) అవతరించింది. అయితే ఈ నేషనలైజేషన్ వెంట 'పాలిటిక్స్' ప్రవేశించడంతో అది తన గమ్యాన్ని అందుకోలేక పోయింది - ఆ అలసత్వానికి విరుగుడే ప్రయివటైజేషన్. ఉన్నత ప్రమాణంలో ఉత్పత్తి లక్ష్యం కుంటుపడ కుండా, పారిశ్రామిక రంగం ఆరోగ్యవంతంగా సాగేందుకు ఇది రాచబాట అనడంతో నా కెట్టి సందేహమూ లేదు"- అన్నారు ఎడ్విన్ గీగర్ (Edwin P Geiger) మద్రాసు మేనేజ్‌మెంట్ అసోసియేషన్ వారు, అమెరికా సమాచార శాఖ సంయుక్తంగా, కెన్నెమెరాలో ఏర్పాటు చేసిన 'లెక్చర్ – డిస్కషన్' సమావేశంలో. ప్రొజెక్టర్‌తో స్లయిడ్స్ చూపిస్తూ, ఆ పట్టికల ద్వారా [illegible] అంశాలు ఎంత సహేతుకమూ సమర్థనీయమో వివరించారు డాక్టర్ ఎడ్విన్ గీగర్. ఐక్యరాజ్యసమితిలోని 88 దేశాలు ప్రయివటైజేషన్ తమ ఆర్థిక విధానంతో ఒక భాగంగా ఆమోదించాయి. మెర్సిడిస్ బెంజ్, వోక్స్ వాగన్, మొబిల్

ఆయిల్ కార్పొరేషన్ వంటి సంస్థలలో ఆర్థిక సలహాదారుగా పనిచేసిన ఎడ్విన్ వరల్డ్ బాంక్, స్విస్ క్రెడిట్ కార్పొరేషన్‌లకు సన్నిహితుడు - ప్రస్తుతం 'యయస్ ఎయిడ్' (USAID) కనసలెంట్.

31

కేంద్ర సాహిత్య అకాడమీ, కుప్పుస్వామి శాస్త్రి రిసెర్చి ఇనిస్టిట్యూట్ (Sahitya Akademi and the Kuppuswami Sastri Research Institute) సంయుక్తంగా నిర్వహిస్తున్న రాధాకృష్ణన్ శతజయంతి ఉత్సవానికి ఈ రోజు మధ్యాహ్నం ప్రారంభ సమావేశం. ఢిల్లీ ఫ్లయిట్ నాలుగు గంటలు లేటు అవడం వల్ల అకాడమీ కార్యదర్శి ఇంద్రనాథ్ చౌధురి సాంస్క్రిట్ కాలేజీకి (సమావేశస్థలం) వచ్చేందుకు కొంచెం ఆలస్యమయింది.... అకాడమీ అధ్యక్షులు బికె భట్టాచార్య తమ ఉపన్యాసంలో రాధాకృష్ణన్ ఒక వ్యక్తిగా మేధావిగా విద్వజ్జనులపై ఎటువంటి ముద్రవేసినదీ తెలిపారు. "'అంతర్జాతీయ అవగాహనకు చరిత్ర ఒక పటుతర శక్తిగా పనిచేస్తుంది. ప్రాచ్య పాశ్చాత్యాలనేవి పరిమిత అర్థంలో వాడే పదాలు.







ప్రపంచంలోని వివిధ సంస్కృతుల తేజఃకిరణాలే, మనసుని విస్తృతం చేసే మార్గ బంధువులు అని చెప్పిన రాధాకృష్ణన్, మన జీవితాలలో, జీవన విధానంలో వైశాల్యత లోపిస్తోందని వాపోయారు. అహింసా పథమొక్కటే ఉన్నత విలువలవైపు, సచేతనత్వం వైపు మననితీసుకు వెళ్ళగలుగుతుంది," - అన్నారు బీరేంద్ర కుమార్ భట్టాచార్య (ప్రసిద్ధ అస్సామీ రచయిత). రిసెర్చి ఫౌండేషన్ డైరక్టర్ జానకి ఆహూతులకు స్వాగతం తెలిపారు: కార్యదర్శి ఇంద్రనాథ్ చౌధురి, అనివార్యకారణాలవల్ల అయిన ఆలస్యానికి మన్నించమని కోరుతూ, సాహిత్య అకాడమీ ఈ రెండురోజుల రాధాకృష్ణన్ సెమినార్, యిక్కడ ఈ సంస్కృత కళాశాలలో, ఆయన స్వగృహానికి రెండు ఫర్లాంగుల దూరాన, నిర్వహించడంలోగల సందర్భశుద్ధీ, ఔచిత్యమూ పేర్కొంటూ, అకాడమీ మూలపురుషుల్లో ఒకరైన రాధాకృష్ణన్‌కి జోహారులర్పించారు. ఇండియన్ కౌన్సిల్ ఫర్ ఫిలాసఫీకి అధ్యక్షుడైన డిపి ఛటోపాధ్యాయ తన లలిత నిగూఢ పదజాలంతో, రాధాకృష్ణ పండితుని తాత్వికసందేశాన్ని చక్కగా చెప్పారు ప్రారంభోపన్యాసంలో. కీ - నోట్ అడ్రస్: బాలకృష్ణ జోషి.... రేపు ఉదయం మార్గరెట్ ఛటర్జీ ఛెయిర్ పెర్సన్‌గా పవిత్ర కుమార్ రాయ్, కుంజిన్ని రాజా, పికె సుందరమ్ 'ఫిలాసఫీ అండ్ లిటరేచర్' అనే అంశంపై తమ ఉపన్యాస పాఠాలు (పేపర్స్) చదువుతారు.

## 1989 సెప్టెంబరు 01

"కర్మ, భక్తి, జ్ఞానమార్గాలలో రాధాకృష్ణన్‌ది జ్ఞానమార్గం. కవీ, ఫిలాసఫరూ యిరువురూకూడా తమ మనో నేత్రంతో లోకాన్ని చూస్తారు. భావానికి కళ్ళెం వేసి భాషని కదం తొక్కించగా కవిత పుడుతుంది" - అని కుంజున్ని రాజా; "గొప్ప ఫిలాసఫర్ కాకుండా కవి కాలేడు. సమస్త సారస్వతమూ భావసుమాల, తత్త్వచింతనల క్రోడీకరణ. 'సాహిత్య' అనే మాటకు అర్థం చేరువగా ఉండమని! విడివిడిగా వుండే వ్యక్తులని దగ్గరకు తేవడమే కళకుగల పరమోద్దేశ్యం. నిర్మించడానికీ, సృష్టించడానికీ గల తేడాని తెలిపేదే ఫిలాసఫీ" - అని పవిత్ర కుమార్ రాయ్; "17వ శతాబ్దిలో కోపర్నికస్ ఈభూమి సర్వసృష్టికీ కేంద్రస్థానం కాదని అనగా, మార్టిన్ లూథర్ వంటి మహనీయుడు ఆ 'కోపర్నికస్' ని వెర్రివాడన్నాడు. ప్లాటో కాలం నుంచి నేటివరకూ మనందరిలోనూ చెరగని విలువలు కాపాడుకోవాలనే ఆరాటం ఉంది. ఆ ఆరాటంనుంచే, ఆ అన్వేషణ నుంచే పొయట్రీ ఫిలాసఫీ జనిస్తున్నాయి" - అని పికె సుందరం తమ పేపర్స్‌లో చెప్పారు: అధ్యక్షస్థానంలో ఉన్న మార్గరెట్ ఛటర్జీ ఉదయం సమావేశాన్ని సమీక్షించారు. .... మధ్యాహ్నం మీటింగ్‌కి వెళ్లబోతూం

డగా, "వైయస్ శాస్త్రిగారు, సచ్చిదానంద మూర్తిగారిని సాయింత్రం పొట్టి శ్రీరాములు హాలుకి తీసుకొచ్చేపని మన మీద పెట్టారు. అయిదుం ముప్పావుకి వుడ్‌లాండ్స్‌కి వచ్చి 'పికప్' చేసుకుంటామని వారికి చెప్పు" - అంది మాలతి. సచ్చిదానందమూర్తి గారితో నాకు పరిచయం లేదు. అకాడమీ ప్రాంతీయ కార్యదర్శి కృష్ణమూర్తి ద్వారా తెలుసుకోవచ్చునని 'సరే' నన్నాను. సెమినార్ ప్రారంభ సమావేశానికీ కడపటి సమావేశానికీ మాత్రమే వస్తానంది మాలతి - నిన్నవచ్చింది. రేపు సాయింత్రం వస్తుందట. నాకైతే తప్పదు.... ఫిలాసఫీ అండ్ రెలిజియన్ (Philosophy and Religion) అనే విషయంపై జరిగింది మధ్యాహ్నం గోష్ఠి. "ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత - ఈ మూడూ మనకి ప్రామాణికాలు. లౌకిక జీవనం వేరు, ఆధ్యాత్మిక జీవనం వేరు. ఈ ఆధ్యాత్మిక జీవన మార్గంలోనే భావ ప్రకోపితమైన జిజ్ఞాస ఉదయిస్తుంది. అది మళ్లీ రెండు విధాలు: బ్రహ్మ జిజ్ఞాస, ధర్మ జిజ్ఞాస .... ధర్మ జిజ్ఞాస లౌకిక న్యాయం నెలకొల్పుతుంది; బ్రహ్మ జిజ్ఞాస వ్యక్తిలోని అంతర్వీక్షణని పెంచి బ్రహ్మ





విద్యవైపుగా మళ్లిస్తుంది. 'బ్రహ్మవిద్య' అనగా దృశ్యమాన జగతిలోని నిజ తత్త్వం నేర్పే ఫిలాసఫీ" - అని టియస్ దేవదాస్; "యామ, నియమ, ఆసనములు అష్ట దళ పద్మము వంటి యోగములో బాహిరానందములు; ధ్యాన, సమాధులు అంతరానంద ములు. ఈ రెండిటి సమన్వయంతోనే మనిషి 'నేను' అనే భావం నుంచి 'మనము' అనే స్థితికి ఎదుగుతున్నాడు. ఆ పెరుగుదలకి కావల్సిన మూడు మార్గాలనే జ్ఞాన, భక్తి, కర్మయోగ ములు అని అన్నారు. శరీరం 'సంసా రం' అనేదానికి కట్టుబడి వుంటుంది. శరరీంలోని 'నేను' ఆత్మ తత్త్వవివేకం తోసర్వాంతర్యామివైపు పయనిస్తుంది. దానిని జీవాత్మ, పరమాత్మలు - అన్నారు. తర్కబద్ధంగాని అద్వైత సిద్ధి అదే - సారూప్యమన్నా, సాయుజ్య మన్నా అదే" - అని యస్. భట్టా చార్య; "ఫిలాసఫర్ అనగా సామాన్య మైన మనిషికాదు - పరిశీలనా పటిమ గల పండితుడు - జ్ఞానధనుడు. 'మతము' అనేది వ్యక్తితో ప్రారంభమై సమూహంలో సంగమిస్తుంది. మత బోధలు సమాజాన్ని లేవనెత్తుతూ, మనిషిని ఉన్నతునిగా చేయగలగాలి. వివేకానంద వేదాంత పరివ్రాజకుడు; రవీంద్రనాథ్ టాగుర్ కవితాహృద యక విద్యావేత్త; లోకమాన్య తిలక్ మహాపండితుడైన రాజనీతిజ్ఞుడు; అహింసే పరమధర్మంగా పేర్కొంటూ ఆ బాటవెంట జాతిని నడిపించిన పుణ్య మూర్తి మహాత్మాగాంధీ; శ్రీ అర విందులు; వినోబా భావే.... ఇటు వంటి మహనీయుల జీవితాలు ఇండి యన్ ఫిలాసఫీకి సజీవ దర్పణాలు" - అని పి. నాగరాజారావు, తమ పేపర్స్ లో వివరించారు. ఛెయిర్ పెర్సన్ సచ్చిదానందమూర్తి, వక్తలు చెప్పిన విషయాలు సమీక్షిస్తూ, రాధాకృష్ణన్ తనను చిన్నప్పట్నుంచీ ఎలా ఆదరించి నదీ, వారి పరిచయ భాగ్యం తనని ఎలా ప్రభావితుని చేసినదీ చెప్పారు. .... సాయింత్రం పొట్టి శ్రీరాములు హాలులో డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ చిత్ర పటావిష్కరణ గావించారు సచ్చిదానందమూర్తి, రాధాకృష్ణన్ ఫిలాసఫీ మీద ఈ మధ్యనే ఆయన ఒక చక్కటి గ్రంథం వ్రాశారు.

. . . . . 02

కుప్పుస్వామిశాస్త్రి రిసెర్చి ఇన్స్టి ట్యూట్‌లో, రాధాకృష్ణన్ సెమినార్, ఉదయం పదిన్నరకి ప్రారంభ మయింది. విషయం: 'సోషల్ అండ్ పొలిటకల్ ఫిలాసఫీ' (Social and Political Philosophy) "హిందూ యిజమ్ కేవలం విధి నిషేధాలతో కూడిన మతం కాదు - ఒక చైతన్య ఉద్యమం. నిరంతరం ముందుకి సాగే సజీవ సంప్రదాయం; సూత్రాలలో యిమడదు - సిద్ధాంతాలకు బందీకాదు' - అని రాధాకృష్ణన్ 1926 లో అప్టన్ లెక్చర్స్‌లో చెప్పారు. మార్క్సిజమ్ చారిత్రకంగా సమర్ధనీయమే - అయితే, అది 'కాలము' అనే కట్టడిని అధిగమించి చూడలేకుండా ఉంది.

లీలక్ట్రానులూ, ప్రొటానులూ సృష్టి ఎలను చెప్పలేవు. తెలుస్తున్నది, కనిపిస్తున్నది, వినిపిస్తున్నది (రియాలిటీ - వాస్తవ ప్రపంచం) - వీటి వెనుకనున్న మిస్టరీని బహిర్గతం చేయగల శక్తి సైన్సుకి లేదు. ఆత్మస్వరూపం, భగవద్భావన - వీటిని గణితమూ నిష్పత్తులూ చెప్పలేవు అంటారు రాధాకృష్ణన్'' - అని ఎ రంగనాథన్' "ఈ లోకమంతా నా అభిప్రాయానికి వ్యతిరేకంగా ఉండవచ్చు. కాని, నేను నమ్మిన దానిని వ్యతిరేకించకుండా వుండటమే నాలోని సమరసభావనకు పునాది అవుతుంది' అన్నాడు ప్లాటొ. భారత దేశంలో వేర్వేరు మతాలకు చెందిన ఫిలాసఫీలు వుండటం వల్ల 'నేషన్‌లిస్ట్ పొలిటికల్ ఫిలాసఫీ' మనలో గట్టిగా పాతుకుపోలేదు. సివిలైస్‌డ్ ఇన్‌డివిడ్యుయాలిజమ్ (Civilised Individualism) వల్లగాని అది సాధ్యంకాదు. సభ్యవర్తన, సంయమన దృష్టితో వ్యక్తులు ఉదాత్తంగా ప్రవర్తించ గలిగిన నాడే, మనది కర్మభూమి అని ఘనంగా చెప్పుకొనే వారి మాటలకు విలువ ఏర్పడుతుంది" - అని పికె మహోపాధ్యాయ; "ప్రస్తుత నాగరికత, ప్రపంచశాంతి, టెక్నాలజీ, ఆర్థిక రాజకీయ సామాజిక స్థితిగతులు, సామ్రాజ్యవాదం, వలస విధానం, భారతీయ దృక్పథమూ భారత సంప్రదాయమూ - వీటన్నిటినీ రాధాకృష్ణన్ ఎంతో స్పష్టంగా సూటిగా వివరించారు. ఆయన ఆదర్శశిఖరం మానవుడు - మానవుని పరిపూర్ణత కన్‌ఫ్యూజియన్ హ్యూమనిజమ్‌తో ఆయన సిద్ధాంతాల సంకెళ్లను తెంచగలిగారు. ఆయనది ప్రాచ్యమతము - పాశ్చాత్య ఆలోచన. ఈ రెండిటి సమన్వయమే ఆయనని ఫిలాసఫర్ - ప్రెసిడెంట్ చేసింది'' – అని భువన్‌ఖాండెల్ తమ పేపర్లలో చెప్పగా అధ్యక్షత వహించిన కిరీష్‌జోషి, సమీక్షా వాక్యాలు చెప్పారు. మధ్యాహ్నం సమావేశానికి ప్రేమ్ కిర్పాల్ అధ్యక్షులు. విద్యారంగంలో రాధాకృష్ణన్ కృషి ఈ గోష్ఠిలోని అంశం .... "మల్టీడైమన్షనల్ పెర్సనాలిటీ అయిన రాధాకృష్ణన్ వివేకంలేని జ్ఞానం నిరుపయోగమనీ, సమన్వయ దృష్టి లేనిదే ఏదీ బోధపడదనీ అన్నారు. నిత్యం కొత్త విషయాలు తెలుసుకోవడం ద్వారానే టీచరు ప్రగతి శీలుడవుతాడు. విద్యాభివృద్ధికి పరిణతి చెందిన భాషముఖ్యావసరం 'నాలెడ్జి (Know-ledge) పోగు చేస్తూకూచుంటే విజ్‌డమ్ (Wisdon) ఎక్కడనుంచి వస్తుంది? సమాచారం (Information) సేకరిస్తూకూచుంటే నాలెడ్జి (Knowledge) ఎక్కడనుంచి వస్తుంది? ఈ వలయం వయసు ఇరవై శాతాబ్దాలే అనుకుంటే మనం దేవునికి దూరమై, ధూళికి చేరువవుతాం' అని టియస్ ఎలియట్ చేసిన హెచ్చరిక విస్మరింపరానిది. విద్యకు గల పరమార్థం ఆత్మోన్నతి" - అని యస్కె వర్మ; "మద్రాసు, మైసూరు, కలకత్తాలలో గాని, వాల్తేరు. బెనారస్, ఆక్స్‌ఫర్డ్‌లో గాని, ఢిల్లీ

రాజ్యసభలో గాని, పారిస్ జెనివా నగరాలలోని అంతర్జాతీయ వేదికల మీద గాని, యంబాసిడర్‌గా గాని, ఎప్పుడూ ఆయన ఒక 'ఎడ్యుకేటర్'. ఎదుట వారికి బోధపరచాలనే ఆ అధ్యాపక లక్షణం ఆయనలో మొదట్నుంచీ ఉంది. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో నెలకు అరవై రూపాయిల జీతం మీద మళయాళం మాస్టారుగా (ఆయనకు మళయాళ భాష రాదు; కాని, ఖాళీగా వున్న పోస్ట్ అది గనక మళయాళం మాస్టారుగా అపాయింట్ చేసి, ఫిలాసఫీ బోధించమన్నారు) ప్రవేశించిన రాధాకృష్ణన్, స్వయం ప్రతిభతో అధ్యక్షస్థానం అందుకున్నారు. ఆయన మొట్టమొదటి పుస్తకం, డెబ్బయి పేజీలది, 1912 లో వెలువడింది. ఫిలాసఫీతో సంబంధంలేని సైకాలజీ పుస్తకమది (Essentials of Psychology) ... దుర్గాబాయిగారికి బెనారస్ హిందూ యూనివర్సిటీ (మదన్ మోహన్ మాళవ్యా) 'పొలిటికల్ సైన్సు' విభాగంలో 'ఆడవాళ్ళకి ఎందుకు, సీటు యివ్వము' అని అన్నప్పుడు, వాల్తేరు ఆంధ్రా యూనివర్సిటీలో ఆమెకు 'పొలిటకల్ సైన్సు' లో సీటు యిచ్చారు రాధాకృష్ణన్. కేంబ్రిడ్జి యూన్‌వర్సిటీ వికెఆర్వి రావు, ఆక్స్‌ఫర్ యూనివర్సిటీ హిరెన్ ముఖర్జి, హుమయూన్ కబీర్ వంటి ప్రముఖులెందర్నో రాధాకృష్ణన్ ఆంధ్రా యూనివర్సిటీకి రప్పించారు. విశ్వవిద్యాలయం అనే మాటలోనే అది భాషలనీ, ప్రాంతాలనీ, దేశపు ఎల్లలనీ అధిగమించే విద్యాకేంద్రమనే అర్థం వుంది- అనేవారాయన" - అని డి ఆంజనేయులూ చెప్పారు. తండ్రిగారి పేరిట జరుగుతున్న ఈ సాహిత్య సెమినార్‌కి ప్రారంభ సమావేశం నుంచీ శ్రద్ధగా వస్తూ చివరిదాకా కూచుంటున్న యస్. గోపాల్‌ని రెండు ముక్కలు చెప్పమన్నారు. "నేను ఆయన యచీవ్‌మెంటుని కాదు - యాక్సిడెంట్‌ని .... చెప్పదలుచుకున్న దంతా ఆయన గురించి వ్రాసిన పుస్తకంలో (బయాగ్రఫీ) చెప్పేశాను. రేపోనేడో అది రిలీజవుతుంది (ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్)" - అని క్లుప్తంగా నాలుగు వాక్యాలు చెప్పి నవ్వించారు యస్ గోపాల్. ప్రేమ్ కిర్పాల్ సమీక్ష తర్వాత, కె ఆర్ శ్రీనివాసయ్యంగారి వాలిడెక్టరీ యడ్రెస్ .... ఈ సాహిత్య సదస్సుని యింత చక్కగా, నిండుగా నిర్వహించిన ఇంద్రనాథ్ చౌధురి (ఢిల్లీ కార్యదర్శి), కృష్ణమూర్తి (మద్రాసు ప్రాంతీయ కార్యదర్శి), వారికి అండగా నిలచిన కార్యాలయోద్యోగుల్నూ, కుప్పుస్వామి ఇన్‌స్టిట్యూట్‌వారూ అభినందనీయులు. ఒక రోజు పెళ్ళికే వుక్కిరి బిక్కిరవుతారు. మూడు రోజుల ఈ కార్యక్రమానికి, వివిధ ప్రాంతాలనుంచి వచ్చినవారిని రిసీవ్ చేసుకు, వారి వసతి సౌకర్యాలు కనిపెడుతూ, మర్యాదగా సాగనంపడం మాటలు కాదు. సెమినార్‌కి వచ్చిన వారందరూ ఉపన్యాసకులనీ,ఆతర్వాత

జరిగిన చర్చలని ఎంతో శ్రద్ధగా ఆసక్తితో ఆలకరించారు.

. . . . . . 04

విజయమాధవీ ఆఫీసులో 'లంకేశ్వరుడు' బ్రేక్‌ఫాస్ట్ పార్టీ. పదహారేళ్ల వయసు, కన్నెపిల్ల వేడికి, ఓం నమః, ఏయ్‌బాబు, యే ఏయ్‌బాబు, పో-పో-పో- పోతే పో, జివ్వుమని కొండగాలి- అయిదు పాటలూ దాసరి నారాయణ రావువి - పాడినవారు బాలు, మనో, జానకి. సంగీతం : రాజ్ - కోటి. నిర్మాత : వడ్డే రమేష్. ఇప్పటికి 50 వేల ఆడియో కాసెట్లు అమ్మకమయా యనీ, ఒక లక్ష చెల్లుబడి అవుతాయనీ, ఇందులో క్వాలిటీ మ్యూజిక్ ఉన్నదనీ, చిరంజీవి పెర్‌ఫారమెన్స్ ప్రేక్షకులని మెప్పిస్తుందనీ, తన దృష్టిలో యిది ఒక కంప్లీట్ ఫిలిమ్ అనీ అన్నారు దాసరి నారాయణరావు. కాసెట్లకు : లియో ఆడియో - విడియో ప్రయివేట్ లిమిటెడ్, పిఆర్ఒ : పసుపులేటి రామారావు.

. . . . . 07

52 సంవత్సరాలక్రితం, జర్మనీ నుంచి అప్పుడే తిరిగివచ్చిన వియన్ శర్మ, ఎల్లెన్ శర్మ దంపతులు స్థాపించిన చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు, ఫౌండర్స్ డే ఫంక్షన్ మ్యూజిక్ అకాడ

మీలో. ఆనాటి చిన్న మొక్క నేడొక మహావృక్షమై శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. శర్మా దంపతులు దివ్య లోకాలకు వెళ్లిపోయారు. కాని, వారి అమ్మాయి శకుంతలా శర్మ, తన సోదరీలైన రుక్మిణీ గీతల సహాయంతో, ఇతర కార్య నిర్వాహక వర్గ సభ్యుల సంపూర్ణ సహకారంతో, ఈ ఆదర్శప్రాయమగు విద్యాకేంద్రాన్ని జయప్రదంగా నిర్వహిస్తున్నారు. అది నుంచి స్కూలు కమిటీలో ఒకరైన అడ్వకేట్ బాలగోపాల్‌కి 90 సం॥లు నిండిన సందర్భంగా, ఆ దంపతులని ఈనాటి వేదికమీద గౌరవించారు. "ఒకప్పుడు టెన్నిస్ రెగ్యులర్‌గా ఆడేవాణ్ణి - ఇప్పుడు వాకింగ్ మాత్రమే విధిగా చేస్తున్నాను. నా ఆరోగ్యరహస్యం వాకింగ్, వేళపట్టున మితాహారం - ఈ రెండూ," అన్నారు బాలగోపాల్ గంభీరకంఠస్వరంతో. చకచకా నడిచే ఆ మనిషికి తొంభయి ఏళ్లు నిండాయంటే నమ్మలేము .... అడయార్ పార్కు హెూటల్‌లో 'కలియుగ విశ్వామిత్ర' ప్రెస్‌మీట్, "యన్‌టిఆర్ మీద యిప్పటికి అనేక చిత్రాలు వచ్చాయి ; ఇందులో ప్రత్యేకత ఏమిటి ?' అని పాత్రికేయులు అడిగిన ప్రశ్నకు సమాధానంగా, "మాది వ్యంగ్య చిత్రం. సామాజిక సమస్యలను ఎదుర్కోలేక, పరిష్కరించలేక పలాయన తత్వంతో ప్రవర్తించే వ్యక్తికి ప్రజలు ఏవిధంగా గుణపాఠం చెబుతారనేది, యిందులోని యితివృత్తం. మా ప్రయత్నాన్ని ప్రజలూ ప్రేక్షకులూ ఆదరిస్తారనే నమ్మకం మాకుంది" - అన్నారు దర్శకులు ప్రదీప్‌శక్తి. నిర్మాత సూర్యనారాయణ బాబు, యాక్టర్ విజయచందర్ ఈ చిత్రంలోని విశేషాలు చెప్పారు. వినీల అనే నూతననటి ఈ పిక్చర్‌లో కనిపిస్తుంది. స్క్రీన్‌శంకర్‌కి ఆమెని పరిచయం చేశాను. వారికి బొమ్మలు కావాలి - వీరికి బొమ్మలు పడాలి.

. . . . . 08

సవేరా కాన్ఫరెన్స్ హాలులో 'సినిమా ట్రేడ్ గైడ్' వారపత్రిక ప్రారంభ సంచికను విడుదల చేస్తూ, పరిశ్రమకు ఎన్నోవిధాల ఉపయోగపడే ఈ ప్రయత్నం సఫలీకృతం అవాలనీ, ఈ పత్రిక పది కాలాలపాటు సినీ పరిశ్రమకు సేవచేయాలనీ అన్నారు సుబ్బరామిరెడ్డి (మహేశ్వరీ-పరమేశ్వరి). ట్రేడ్ ఇన్‌ఫర్మేషన్ అందించే యిటువంటి పత్రిక ఈనాడు ఎంతో అవసరమని అన్నారు పూర్ణోదయా ఏడిద నాగేశ్వరరావు. ఈ నూతన ప్రయత్నం విజయవంతమవాలని శుభాకాంక్షలు తెలిపారు శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి (యమ్మెస్ ఆర్ట్స్).... ప్రధాన సంపాదకులు : అర్జునరావు ; సంపాదకులు : కె. వెంకటేశ్వరరావు ; ఛీఫ్‌రిపోర్టర్ : మనోహర్ ; అసోసియేట్ ఎడిటర్స్ : పద్మపాణి, సురేంద్రబాబు ; ఫొటోగ్రాఫర్ : రాజ్‌మోహన్ ; ఆఫీసు మేనేజరు : శ్రీనివాసరావు కాపీ వెల: రు. 5-00 ; సం॥ చందా రు. 260-00....

—యన్నార్ చందూర్

# కొత్త పుస్తకాలు

"ఊహా రోగి" - "పిసినారి".... మూలం: మోలియేర్; అనువాదం: వినయమణి. ప్రచురణ: విశాలాంధ్ర బుక్ హవుస్, 4 - 1 - 435, విజ్ఞాన భవన్, బ్యాంక్‌స్ట్రీట్, హైదరాబాదు - 500001. వెల: రు 10 - 00; రు 8-00. ఫ్రెంచి నాటక రచయిత మోలియేర్ తెలుగు వారికి చిరపరిచితుడే. కీర్తిశేషులు భమిడిపాటి రామేశ్వరరావు మోలియేర్ ఆధారంగా అనేక హాస్య నాటికలను రచించారు. అవి రచనలుగానే కాక ప్రదర్శనలుగా కూడా బహుళ జనాదరణ పొందాయి.

అలియాన్స్ ఫ్రాన్సేజ్, హైద్రాబాదు వారి ఆర్థిక సహకారంతో ప్రచురించిన యీ రెండు తెలుగు అనువాదాల్లో ఒక ప్రత్యేకత వున్నది. నేరుగా ఫ్రెంచి నుండి యివి తెలుగులోకి అనువదింపబడినాయి. సాధారణంగా ఫ్రెంచి నవలలూ, కథలూ మనకు యింగ్లిషు అనువాదాలనుండి తెలుగులోకి వస్తూ వుంటాయి. రచయిత్రి, అనువాదాన్ని చాలావరకు మూలానికి దగ్గిరగా వుండేటట్లు చూసుకున్నామని చెప్తున్నారు. పేర్లు మాత్రం మార్చడం జరిగింది.

మోలియేర్ 17వ శతాబ్దంలో పారిస్ నగరంలో పుట్టి పెరిగాడు. అక్కడే ఒక నాటక సమాజం స్థాపించి, నాటకాలు వ్రాసి, ఆడిస్తూవుండేవాడు. తరువాత దేశమంతటా తిరిగి ప్రదర్శనలు యిచ్చాడు. అప్పటి ఫ్రాన్సు రాజయిన పధ్నాలవ లూయీ ఎదుట ఒక నాటకాన్ని వేసి మెప్పించాక, ఆయన ఆర్థిక పరిస్థితి మెరుగు పడింది. మోలియేర్ తన నాటకాల్లో స్వయంగా ప్రధాన పాత్ర - పోషణ చేస్తూ వుండేవాడు. ఆయన వ్రాసిన నాటికలన్నీ వ్యంగ్య హాస్యప్రధాన మయినవే.

చివరకు 'ఊహా రోగి' నాటికలో నాయకుడుగా వేషం వేసి, ప్రదర్శన యిస్తూ వుండగా జబ్బుచేసి, ఆ రాత్రే ఆయన మరణిస్తాడు.

మనుష్యుల్లో వుండే బలహీనతలను, సమాజంలోని లొసుగులనూ హేళన చేస్తూ చూపించడమే ఆయన నాటక రచనలోని ముఖ్యాశయం. ఈ సంవత్సరం యిండియాలో జరుగుతున్న ఫ్రెంచి వుత్సవం సందర్భంగా యీ పుస్తకాల ప్రచురణ జరిగింది.

—సరోజినీ ప్రేమ్‌చంద్

గౌతమ వ్యాసములు. రచన: పింగళి లక్ష్మీకాంతం. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాదు, వెల : రు 20-00.

పింగళి లక్ష్మీకాంతంగారి వ్యాస సంకలనమును స్వల్పమార్పులతో, వారు వ్రాసిన ద్విపదకావ్యముల పీఠికలను ఒకచోట వుంచే ప్రయత్నమిది అని ప్రకాశకులు చెప్పారు. ఇందు ఆంధ్ర వాఙ్మయ స్థూలరూపము, ఆంధ్రనాటక కళాపరిషత్తునందు వాగొసగిన అధ్యక్షోపన్యాసము, ద్విపద భారతము, రంగనాథ రామాయణము, మానికొండ రామాయణము, వ్యాసమంజరి, ముసలమ్మమరణము, ప్రభావతి ప్రద్యుమ్నము, పల్నాటి చరిత్ర గురించి వున్నాయి.

'ఆంధ్ర వాఙ్మయ స్థూలరూపము' నందు ప్రాచీన, లక్షణములు గల నన్నయ్య సాహిత్యం మొదలు, ఆధునిక యుగమున నవ్యరూపమున నున్న (వచనము, నాటకము, భావకవిత్వము) సాహిత్యం వరకు చర్చించారు. 'ద్విపద భారతము' పీఠికలో కాలాంతరమున కవిత్రయ భారతము మాతృకగా ద్విపద భారతము - తిమ్మయ సోమన, బాల సరస్వతీల ద్విపద కవిత్వము అవతరించిన విధము కూలంకషముగా చెప్పారు.

'ప్రభావతి ప్రద్యుమ్నము' కథా మూలాధారములు, హరివంశ మందలి కథ - ప్రస్తుతకథ వివరించారు. 'పల్నాటి వీరచరిత్ర'లో ఆ వీరుల చరిత్రయేకాక కథా వస్తువు కావ్య సంపదను, దేశీతనమును ప్రతిష్ఠించినది. దేశీయమైన పదకవిత్వానికి, సాంస్కృతికమైన ప్రాచీన సామరస్యం కలిగించినవారే ఈద్విపద కావ్యకర్తలు, 'పల్నాటి వీరచరిత్ర'లో పోషింపబడిన వీరరసమూ పోషింపబడిన ఛందస్సు - పింగళివారు విపులీకరించారు. సాహిత్య పరిచయమున్నవారికి - పింగళి లక్ష్మీకాంతం గారి పేరు చెప్పనక్కరలేదు. సాహితీ ప్రియులందరు చదవదగిన పుస్తకము.

—వాణీ మోహన్

## సమీక్షలు

## చిత్రజగతి

### కెయస్ ఫిలింస్ 'డేంజరస్ మిషన్' (Dangerous Mission)

వెండితెరమీద సాహసోపేత నాయకునిగా జాకీచాన్ (Jackie Chan) చిరపరిచితుడు. హాలీవుడ్‌కి చెందిన ఎనమండుగురు 'స్టంట్‌మెన్' పాల్గొన్న ఈ చిత్రంలో జాకీచాన్ సోదరుడు సెల్వియాఛాన్ (Sylvia Chan) కథానాయకుడు.... న్యూయార్క్ డిటెక్టివ్ 'కొడిజాక్'కి, 'తెల్ల తొడుగు' (White Glove) హస్తగతమైన వజ్రాలు, వెనక్కి రాబట్టే కార్యాన్ని వొప్పగిస్తారు. అసలు ఏంజరిగిదంటే, హాంగ్‌కాంగ్ ముఠాకి చెందిన 'తెల్లతొడుగు' తమ వద్దనుంచి వజ్రాపహరణ చేశాడని, షికాగోముఠా యజమాని మాంటీ, గాడ్‌ఫాదర్‌కి ఫిర్యాదు చేస్తాడు. 'తెల్లతొడుగు' స్వయంగా హాజరై, తను అటువంటి ధూర్త కార్యం చేయలేదనీ, మరింకెవరో చేసిన పని అనీ విన్నవించుకుంటాడు.... ఈ వజ్రాలకోసం హాంకాంగ్‌లు ముప్పేటగా అన్వేషణ ప్రారంభమవుతుంది. డిటెక్టివ్ కొడిజాక్, షికాగో ముఠా మాంటీ, హాంకాంగ్ 'తెల్ల తొడుగు'.... జేబుదొంగల కోవకి చెందిన 'శామ్' అనేవాని దగ్గర నుంచి ఆ వజ్రాలు రాబట్టి, అతనిని బెదరించీ భయపెట్టీ 'తెల్లతొడుగు' వునికి తెలుసుకు, అంతర్జాతీయ క్రిమినల్స్‌ని అంతమొందిస్తాడు - 'ఇంటర్‌పోల్' ఆదేశ ప్రకారం ఈ నేర పరిశోధన గావించిన కొడిజాక్, ఎరిక్ సాంగ్ (Eric Tsang) దర్శకత్వం వహించిన ఈ చిత్రం గగుర్పొడిచే సన్నివేశాలతో గమన వేగముతో ప్రేక్షకులని అలరిస్తుంది. ....

పిఆర్ఒ: టియమ్ రామన్.

### శశాంక ఆర్ట్స్‌వారి తాతయ్య పెళ్లి మనవడి శోభనం

కాలేజీ విద్యార్థి రాంబాబు (సుధాకర్) తన క్లాసుమేటుకి (కల్పన) ప్రేమ లేఖలు రాసి, ఆమె చేత చివాట్లు తింటాడు - తన కళ్ల ముందే ఆమె తన ప్రేమలేఖని చింపేస్తుంది. విషాదంలో మునిగిపోయిన మనవడికి ఉత్సాహం కలిగించేందుకు తాతయ్య (సత్యనారాయణ) తన కాలంలో వామనరావు పుస్తకం ఎలా పని చేసిందీ, ప్రేమవలవిసిరి బామ్మని పెళ్లాడ్డం

లో ఆ పుస్తకం ఎలా తోడ్పడినదీ చెబుతాడు. 'దిగులు చెందకు, రాం పండూ - నీ ప్రేమ సఫలమవుతుంది- నేనున్నానుగా నీకు ఉపాయం చెప్పేం దుకు' - అని హామీయిస్తాడు తాత గారు ప్రతాపరావు. ఒకానొక సంద ర్భంగా రాంబాబు చావుదెబ్బలు తిన డంతో కథానాయిక కాస్త జాలిపడు తుంది.... ఈ యువతీ యువకుల ప్రేమ అలా వుండగా, తాతయ్యది మరి కొంత గ్రంథం. కథలో నవ్యత గాని, రసపుష్టిగాని లేవు. నటీనటు లందరూ పాత్రోచితంగా చేశారు. దర్శకులు : సాహితి. నిర్మాతలు : శ్రీనివాసులు, నూకరాజు.... పిఆర్ఒ ; పసుపులేటి రామారావు.

## అన్నపూర్ణా సినీచిత్ర 'పల్నాటి రుద్రయ్య'

ఇంజనీరింగ్ స్టూడెంటూ (సుమన్), లాకాలేజీ స్టూడెంటూ (విజయశాంతి) బ్రేక్ డాన్స్ చేసి, ఇంటర్ కాలేజియేట్ పోటీలో ప్రథమ బహుమతి అయిన రాధాకృష్ణ విగ్రహాన్ని పొందుతారు. 'ఆ బహుమతి మీదగ్గిరే వుంచండి' అంటాడు షివల్రస్‌గా రుద్రయ్య ; శిశు పాలరావు (కోట శ్రీనివాసరావు) చెల్లె లైన స్వాతి, సిగ్గు దొంతరలు వొలక బోస్తూ మనసు పారేసుకుంటుంది. ఈ మంచి వాళ్లకు ప్రతికక్షులుగా పరాత్పరరావు (సత్యనారాయణ) ఆయన సోదరులూ, ఊరంతటినీ గడ గడ లాడించే సైంధవరావు (కన్నడ ప్రభాకర్) మున్నగువారు. ఫాక్టరీలో యింజనీరుగా పని చేస్తున్న రుద్రయ్య, పాతిక వేలు చందా అడగ డానికి వచ్చిన సైంధవరావుకి, తన దెబ్బ రుచి చూపించి, యజమానినీ ఫాక్టరీని కాపాడుతాడు. అయితే నీతీ నియమంలేని ఈ పరాత్పరం, వాచ్ మాన్ (పద్మనాభం) చేత దొంగ సాక్ష్యంతో, రుద్రయ్యని మర్డర్ కేసులో యిరికించి, మూడేళ్ల జైలుకి పంపు తాడు - ఈ కేసులో పబ్లిక్ ప్రాసి క్యూటర్ రుద్రయ్య భార్య స్వాతే! సినిమా గనక నాటకీయత గ్రహించి వాస్తవికత గాలికి వొదిలేయాలి .... సైంధవరావుని చూస్తూంటే, మన తెలుగు పట్నాలూ, న్యాయస్థానాలూ ఒక లేడీ ప్రాసిక్యూటర్ రక్షణ నివ్వ లేనంత దుస్థితిలో ఉన్నాయా అని జాలేస్తుంది. అది ఎంతమాత్రం నిజం కాదు - సినీహీరోని గ్లామరైజ్ చేసేందుకు, అతను అజేయుడని నిరూ పించేందుకు పడే శ్రమ అదంతా. యాక్షన్ హీరోగా సుమన్, భావ శబలతతో విజయశాంతి బాగా చేశారు. ఓంకార్ కథ దర్శకత్వం : బియల్వీ ప్రసాద్. నిర్మాత : తులసి. సమర్పణ : కాటగడ్డ ప్రసాద్.

---

ప్రాచీన కావ్యాలకంటె ఆధునిక విజ్ఞాన గ్రంథాలు బుద్ధిని వికసింప జేస్తాయి. —హాల్డేన్

ప్రియుడు తనని నిర్లక్ష్యం చేయడం మొదలు పెట్టేదాకా, ప్రేమించడం ప్రారంభించదు స్త్రీ. —జెరోమ్

